శ్రీ వేంకటేశ పరబ్రహ్మణేనమః



కలియుగ వైకుంఠంబను

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము

శ్రీ వేంకటేశ్వర పద్మావతీ పరిణయ మహోత్సవము.



ఇయ్యది పండితులచే చక్కఁగా సవరింపబడి


తిరుపతి బుక్ సెల్లర్ అండ్ పబ్లిషరు,

టి. కె. గోవిందరాజులు నాయుడుగారిచే

తిరుపతి శ్రీవాణీ ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రచురింపబడినది.

11-వ కూర్పు.

దీని వెల ]  1940  [ ప్రతి 1-కి 0—10—0

# విషయసూచిక




తిరుమల యాత్రా ప్రభావము 6

ధర్మసత్రము 7

తిరుచానూరు లేక అలిమేలుమంగాపురం 8

శ్రీవేంకటేశ్వరస్వామివారి యాత్ర 9

శ్రీ కపిలతీర్థం మహిమ 9

శ్రీహాథీరాం బావాజీ చరిత్రము 11

నైమిశారణ్య ప్రభావము 17

సూతుడు శౌనకాది మునులకు శ్రీవేంకటాచల చరిత్రము చెప్పుట 18

వృషభాద్రి యనుటకు కారణము 19

అంజనాద్రి యనుటకు కారణము 20

శేషాద్రి యనుటకు కారణము 22

కలియుగమున వేంకటాద్రి యనుటకు కారణము 23

ఆది వరాహావతారము 24

వైకుంఠమునుండి గరుత్మంతుడు కికీటపర్వతమును తెచ్చుట 25

నారదుడు కశ్యపాది మునుల యొద్దకుపోవుట 26

భృగుమహర్షి త్రిమూర్తుల శోధించుట 27

భృగుమహర్షి హరి వక్షస్థలంబున తన్నుట 28

లక్ష్మి మహావిష్ణువుతో కోపించి కొల్హాపురము జేరుట 29

శ్రీమహావిష్ణువు భూలోకమునకువచ్చుట 30

పుట్టలోనుండు హరికి కరియావు పాలిచ్చుట, గోపాలుడు కనిపెట్టుట 32

చోళరాజునకు హరి శాపమిచ్చుట 33

హరి వరాహస్వామిని సంధించుట 34

వకుళమాలిక పూర్వజన్మవృత్తాంతము 37

పద్మావతీదేవి జననము 37

శ్రీనివాసమూర్తి పద్మావతిని గని వరించుట 43

హరి వకుళకు రామకథ చెప్పుట. 48
హరి ఎఱుకల వేషము బూనుట 51
శ్రీ వెంకటేశ్వర పద్మావతి పరిణయ మహోత్సవము 66
తొండమానుని వసుధానుని యుద్ధారంభము 71
హరి చక్రముచే మూర్ఛనొంది తెలివొందుట 72
తొండమానుని పూర్వజన్మవృత్తాంతము 73
తొండమానునికి హరి విశ్వరూపము జూపుట 75
తొండమానునికి హరి గోపీనాథుని చరిత్రము చెల్పుట 76
రంగదాసునకు గోపీనాథుడు శాపంబొసంగుట 77
హరికి బ్రహ్మచే జరిపిన బ్రహ్మోత్సవ క్రమము 79
కూర్మండను బ్రాహ్మణుని కథ 80
తొండమానుచక్రవర్తి హరిని సువర్ణపుష్పములచే పూజించుట 82
భీముడను కుమ్మరదాసు హరిని మట్టి పుష్పములతో నర్చించుట 83
తొండమానుడు భీమునితో సంభాషించుట 84
హరి భీమునకు మోక్షమిచ్చుట 84
తొండమానుడు తపమున కేగుట 85
హరి లక్ష్మీదేవిని దలచి చింతిలుట 86
హరి తపంబు చేయబోవుట 86
ఆకాశవాణి హరికి వుపాయము జెప్పుట 87
పద్మావతి హరినిదలచి చింతిల్లుట 89
కపిల మహర్షికిన్ని లక్ష్మీదేవికిన్ని సంవాదము 89
లక్ష్మీ పాతాళలోకమునన్నున్న పద్మసరస్సు జేరుట. 91
భృగుఋషి తన్ను మన్నించమని లక్ష్మిని ప్రార్థించుట 92

# తిరుమల యాత్ర ప్రభావము.



హిమాలయం మొదలు కన్యాకుమారివరకు అనేకమైన పుణ్య క్షేత్రములు, హిందూమతమునకుగాను పెద్దలచే యేర్పరుపబడియున్నది. కాని యాత్రికులు యేస్థళమునకు పోవుచున్నది సామాన్యమైన జనులకు తెలియదు. అయితే తిరుమలకొండకు వచ్చుభక్తులు అట్లుకాక పసుపుచే తడుపబడు వస్త్రములను ధరించి, వారు ఆపత్కాలమునందు మొక్కుకొన్నటువంటి ముడుపుల చేతను, వారు శ్రీస్వామివారియొక్క భక్తిని వేయినోళ్ల గొనియాడుచు గోవిందనామస్మరణములు భజింపుచు రావడమువల్లనే ప్రతిమానవునికిన్ని వీళ్లు శ్రీవేంకటాచలపురమునకు పోవువారని తప్పక గోచరింపకమానదు. యిదియునుంగాక తిరుమలకు పోవు దోవయందు యాత్రికులు చీమలబారువలె అనేకమైన భక్తిచే గోవిందనామస్మరణలుచేయుచు పోగలభక్తులకున్ను సదరుదోవయందు యుండగల బిక్షుగాండ్లుయొక్క దీనాలాపమున్ను, త్రోవకిరుప్రక్కల యుండగల వనసంజీవితోకూడిన వృక్షములయొక్క ఆనందమైనగాలి యున్ను, సదరుత్రోవలో పారునటువంటి ఆనందమైన తీర్థమున్ను, చూచు ప్రతిమానవునికిన్ని, శ్రీవేంకటేశ్వరస్వామివారియొక్క మహిమ వర్ణనాతీతముకాగలదు. కలియుగవైకుంఠంబను ప్రఖ్యాతి జెందిన సాక్షాత్ శ్రీవేంకటేశ్వరస్వామివారిని దర్శించి తిరుమలయొక్క వైభవములుగాంచిన ప్రతిమానవులున్ను ప్రపంచమునందు భగవంతుడే లేదని వాదించగల యేనాస్తికుడైనను యచ్చోటియందు ఖండితముగా భగవంతుడు యున్నాడని చెప్పకమానడు. ఈ కలియుగమునందు యిప్పుడు యెంతనవనాగరీకము కలిగినప్పటికిన్ని మనకు కష్టము కలిగినప్పుడు యేమాదిరి శ్రీస్వామివారికి ప్రార్థనలుచేసుకుంటామో ఆలాగే చెల్లించవలయును. లేనియెడల సదరు ప్రార్థనలకు అసలు వడ్డీతోడను వసూలుచేయుటకు శ్రీస్వామివారికి శక్తిగలదు. ఇదిమాత్రం నేటికిని జరుగుచున్నది. అనేక భక్తులకున్ను అనుభవముకలిగియున్నది. యీయొక్క ప్రభావము కలియుగమునందు వీరికిమాత్రము గలదు.

ఈమొక్క తిరుపతియను దివ్యక్షేత్రము పూర్వకాలమునందు శ్రీకృష్ణదేవరాయులవారియొక్క వంశములో పాలింపబడుచుండినది. వార్లు తిరుపతికిసమీపం చంద్రగిరిని ముఖ్యస్థానముగా నేర్పరుచుకొని యుండినారు. చంద్రగిరిలో యిప్పటికిన్ని వార్లు యుండినటువంటి భవనములు నిండా అందముగాను, కొన్ని నూతనముగానున్ను, కొన్ని శిధిలమైయుంటున్నవి. సదరు భవనములు యిప్పుడు గవర్నమెంటువారు స్వాధీనపరచుకొనియున్నారు. వీరివెనుక కొన్నిదినములకు సదరు దేవస్థానమును బైరాగులస్వాధీనము చేసినారు. వార్లున్ను కొంతవరకు శ్రీస్వామివారికి నిండాభక్తి శ్రద్ధలతో పూజలు జరుపుచూయుండినారు యిప్పుడు సదరు దేవస్థానమును గవర్నమెంటువారు స్వాధీనపరచుకొని సదరు దేవస్థానములకు ఒక కమీషనరును యేర్పాటుచేసి వీరిపైన ఒక కమిటీని నియమించి వీర్ల పాలనక్రింద స॥ దేవస్థానములు పాలింపబడుచున్నవి స॥ దేవస్థానములకు రాగల వరుంబడి యావత్తున్ను శ్రీస్వామి వారి కైంకర్యములకున్ను, సిబ్బంది సెలవులకున్ను, వుపయోగపడుచున్న వేగాని యితరవిధములైన దుర్వినియోగముగాని, గవర్నమెంటు వారు స॥ పైకమును అపహరించుటకుగాని, యేమాత్రమున్ను లేదు. గనుక యాత్రికులు శ్రీస్వామివారికి చెల్లించవలసిన ప్రార్థనలు అనగా బంగారు, వెండి, ఆభరణములున్ను, పైకముయావత్తున్ను శ్రీవారి కొప్పెరలో యేవిధమైన సందేహములేక వేయవచ్చును.

## ధర్మసత్రము.

ఇది తిరుమల తిరుపతి వగైరా దేవస్థానముల వారివలన కట్టబడినది. యీసత్రము తిరుపతి తూర్పు రైల్వేస్టేషను సమీపములో యుంటున్నది ఈసత్రముకట్టుటకు సుమారు రెండులక్షలు రూపాయలు కర్చు అయినది. యీసత్రములో యాత్రికులకుకావలసిన అన్ని సౌకర్యములున్ను యేర్పాటుచేసియున్నారు. నీటివసతియు యెలక్ట్రికు దీపములున్ను, యాత్రికులకు కావలసిన వంటసామానులు, వగైరా యావత్తున్ను, దేవస్థానం వుద్యోగులను అచ్చటనియమించి యాత్రికులకు నిండా సౌకర్యము కలుగచేసినారు.

# తిరుచానూరు లేక అలిమేలుమంగాపురం.

ఈపురము తిరుపతికి సమీపముగా మూడుమైళ్ళదూరములోనున్నది. యిచ్చట పద్మావతిదేవియొక్క ఆలయమున్నది. యీ దేవిని అలిమేలు మంగమ్మఅనియు, పద్మావతిదేవి యనియు రెండు నామధేయములతో యాత్రికులు పిలువబడుచుండుటవలన అందుచేతనే యీపట్టణమునకు అలిమేలుమంగాపురంబని నామధేయము కలిగినది. తిరుమలకు వచ్చు ప్రతి యాత్రికుడున్ను తిరుచానూరికిపోయి శ్రీఅమ్మవారి దర్శనము చేసుకొని పోవు వాడుకగలదు. శ్రీతాయార్లవారికి ప్రతి సంవత్సరం కార్తికమాసమునందు బ్రహ్మోత్సవము జరుగును. సదరు వుత్సవమునకు వేలకొలదిప్రజలు వచ్చేవాడుకగలదు. యిచ్చట పద్మసరోవరము గలదు. యిది పూర్వము లక్ష్మీదేవినిగూర్చి శ్రీవేంకటేశ్వరస్వామివారు తపస్సు చేయబడినప్పుడు నిర్మింపబడినదని పురాణమందుకలదు. యీ సరస్సును చూచుటకు చాలఅందముగాను రమణీయముగాయుండునట్లు పెద్దలు యేర్పాటు జేసియున్నారు. యీసరస్సునందు రెండు బిలములు యేర్పాటుచేసియున్నారు. ఒకబిలమునందు జలము వచ్చుటకున్ను రెండవదానియందు జలము బయటపోవుటకున్ను యేర్పాటుచేసియుండుటవలన సరోవర జలము యెప్పుడున్ను నిండాశుభ్రముగా యుండును. యీసరోవరముచుట్టు అనేక ధర్మసత్రములుగలవు యీ సత్రములలో సంవత్సరకాలమున్ను వివాహములు జరుగుచునే యుండును. యిచ్చట రాజాధిరాజులు, జమీందార్లు, గొప్పగొప్ప ధనికులు, వేలకొలది ద్రవ్యము కర్చుచేసి వివాహములు జరిపించుకొనిన యెడల వారి కుటుంభమునకు నిండా శ్రేయస్సుగాను, శ్రీపద్మావతి అమ్మవారి అనుగ్రహమువలన దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యసంపదలచే వర్ధిల్లుదురని నమ్మకముగలదు. అందువలన అచ్చట సంవత్సరకాలము వివాహములు జరుగుచునేయుండును.

# శ్రీ వేంకటేశ్వర స్వామివారి యాత్ర.

చెన్న రాజధాని చిత్తూరుజిల్లాలో శ్రీపురమని సంస్కృతనామముచే వ్యవహరింపబడు తిరుపతి మునిసిపల్ పట్టణము. శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనమునకువచ్చు యాత్రికులు గూడూరు, రేణిగుంట, పాకాలా, కాట్పాడి రైల్వేజంక్షనులద్వారా తిరుపతికి రావలసినందున అనేకులాజంక్షనులకు రమ్మనివేడెదరు. బసలలో అన్నివిధసౌకర్యములు కలుగజేయుదురు. దేవస్థానంవారి అనేకధర్మసత్రములున్ను కలవు.

# శ్రీ కపిలతీర్థం.

ఈతీర్థం మిగుల ప్రాచీనము. యిచ్చట భూలోకములో పార్వతీ పరమేశ్వరులు కపిలమహాఋషికి ప్రత్యక్షమైరి. ఈ లింగము పాతాళములో సురులచేతను, కపిలమహాముని చేతను పూజింపబడి భూలోకమునకే తెంచెను. శ్రీ వేంకటేశ్వరస్వామివారు వకుళమాలికాదేవిని శ్రీపద్మావతిదేవి వివాహార్థాయబారమునకు మొదటబంపునపుడీతీర్థములో స్నానముచేసి శ్రీకపిలేశ్వరస్వామివారి దర్శనముచేసుకొని ప్రయాణమైనట్లును,

శ్లో॥ అస్మాదేవవరాన్మార్గా దపరుహ్యాగిరేస్తటాత్ ।
త్వంగచ్ఛాదః ప్రదేశేచకాపిలం లిఙ్గముత్తమమ్ ॥
శ్లో॥ తత్రాస్తేతీర్థరాజోయం॥ కపిలేశ్వరసన్నిధౌ ।
తత్రస్నాత్వాయథాభోగ్యం మనిర్గంతీర్థపుంగవే ॥
శ్లో॥ కపిలేశ్వరమహాత్మ్య యాచ్యతాం వరమవ్యయమ్ ।
శ్రీనివాసేన బాలేనసదాకళ్యాణ కాంక్షిణా ।
శ్లో॥ ప్రేషితాహం తదర్థం వైకుంఠమే భీప్సితంప్రియమ్ ॥
ఏకామువ్యాశివందేవి తతః పద్మాలయంగతా॥

యీక్షేత్రము తిరుపతికి వకటిన్నర మైలు దూరమునయున్నది. శ్రీ వెంకటేశ్వరస్వామివారి దర్శనమునకు కొండనెక్కకమునుపే యీతీర్థములో స్నానముచేసి హిరణ్యము తీర్థవిధియు యిచ్చటజరుపుదురు. సంకల్పములు, దానధర్మములు, తీర్థశ్రాద్ధములు, తమశక్త్యానుసారము చేయుదురు. యీక్షేత్రములో పితృరులకు పిండప్రదానములుచేసిన పితృదేవతలుతరింతురు. కొండ అడుగుభాగమునకు అలిపిరి అనగా కొండ పాదమని చెప్పుదురు. యిచ్చట పాదరక్షలుగల మంటపముగలదు. యిది శ్రీవెంకటేశ్వరస్వామివారివని వాడుకొందురు. అలిపిరిరస్తాలో అలిపిరి నుండి వకటిన్నర మైలుదూరమున గాలిగోపురమున్నది. యీగోపురము చాలాదూరము కనబడును. యిచ్చట ఒక బైరాగిమఠమున్నది యిందు వృత్తరహిందూస్థాని సాధులుందురు. దీనినే వైకుంఠద్వార మఠమనియు వాడెదరు. అటుతర్వాత మరికొంతదూరమున పెట్టెలువేర్చినటుల శిలలు గలవు. ఆపెట్టెలకు నాలుగుప్రక్కల ఆంజనేయ విగ్రహములుగలవు. శ్రీపద్మావతమ్మవారు సారెతెచ్చుకొనుచు శ్రీవారితోనలిగి నాపెట్టెల నచ్చటనేవదలి పద్మసరోవరమునకు వెళ్లినదట. యిచ్చట శ్రీఅమ్మవారి అడుగులు జాడలగుపడును. యీకొండను తిరుపతికొండయనియు, తిరుమలై తిరుపతియని వాడెదరు. యీకొండకు కృతయుగములో వృషభాచలమనియు, త్రేతాయుగములో నంజనాచలమనియు, ద్వాపరయుగములో శేషాచలమనియు, కలియుగములో వేంకటాచలమనియు, పేర్లొచ్చుటకు కారణాంబికముందు చదువగలరు. శ్రీవేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము చాలాప్రాచీనమైనదని పురాణములు ఘోషించుచున్నవి. శ్రీస్వామివారి చిహ్నములు శివుడనియు, విష్ణువనియు, శక్తియనియు భక్తులకు తోచకమానదు. లిఖనసమతస్తులు పూజనొనర్చెదరు. కలియుగాదిలోపుట్టినదనియు, కలియుగాది 5000 సంవత్సరములయినపిమ్మట విష్ణుపూజతగ్గినదనియు పురాణములోయున్నట్లు తెలియవచ్చుచున్నది. శ్రీవారి సింహద్వారమునకు పడికావలియనిపేరు.

లోనికి ప్రవేశింపగనే బంగారుపూతవేయబడిన ధ్వజస్తంభముగుపడును. పడికావలెదాటగనే సంపంగి ప్రదక్షిణము, పడికావలి ద్వారము దాటగా విమానప్రదక్షిణమును యిదిగాక ధనుర్మాసములో శుక్లపక్ష యేకాదశి యుదయమున తెరచి ద్వాదశి సాయంకాలము మూయబడు శ్రీవైకుంఠ ప్రదక్షిణమును గలదు.

## శ్రీ హత్తి రాంజీ వారు.

శ్రీవేంకటేశ్వర స్వామివారి ఆలయమునకు ఆగ్నేయమూల శ్రీహత్తీరాములవారి గొప్పమఠ మొకటిగలదు. యీహత్తీరాములు వారు వుత్తరహిందూస్తానములో ఢిల్లీకి 20 మైళ్ల దూరములోయుండు కేడల్ క్రేడనగరములో జన్మించి కాశీక్షేత్రమందు శ్రీసద్గురు అనుభవానందజీస్వాములవారి శిష్యులై శ్రీగురుపాదోదకంబును స్వీకరించుకొని సద్గురునిచే అనేక మంగళాశాసనములుపొంది బైరాగీ యాశ్రమావలంబునుండై తెల్లటికౌపీనంబొక్కటిమాత్రము ధరించుకొని చేతిలో యోగదండమునున్నూ, కమండలమున్నూ, పట్టుకొని "బా లా జీ బేహరీరాం గోవిందాగిరదారేరాం" అనిపాడుచు శ్రీనివాసునిధ్యానించుచు శేషాద్రికి బైలుదేరిరి. విషయాదులందంత కరణములు పరిచరించనివ్వక శ్రీనివాసునియందే ధ్యానమునిల్పి సర్వమునుత్యజించి యింద్రియాదులనిగ్రహించి శ్రీనివాసమూర్తియే గతియని బాహ్యవిషయములయందుండి చిత్తమునుబిడతీసి శ్రీవేంకటేశ్వరులేగతియనియు తోడునీడ సర్వము శ్రీనివాసుడేయని నమ్మి సర్వం బాలాజీమయంబని చక్కగా యెఱింగినవారై యిహపరభోగములందు అనుమాత్రమైన ఆశలులేక సర్వదాభగవంతుని కళ్యాణగుణములవర్ణించుచు సర్వము బా లా జీ మయమే నేనెందుపోయిన నందగుపడుచున్నాడు నేనెందుపోయినా భయములేదు. యీనాప్రాణము, దేహము, శక్తి, బుద్ధీంద్రియములు, సర్వము వారిదేను. వారి దివ్యదేవాలయమునకు సొంపుట. నాపాదముల కుత్సాహము వారికిసేవచేయుభక్తులే నాబంధువులు వారితీర్థమేనాకు జీవాధార రసాయనము. వారిదర్శనము కైవల్యము అని పలువిధముల

ధ్యానించుచు హరిద్వారము, ద్వారక, మధుర, బృందావనము, గోకులము, జగన్నాథము, వుడిపి మొదలగు పుణ్యక్షేత్రముల దర్శించి హేమ శిఖరాళిచే ప్రకాశించుచున్న శ్రీవైకుంఠమను శ్రీవేంకటాచలమునకువచ్చెను. యిచ్చట శ్రీవారి దేవస్థానోద్యోగుల నాశ్రయించి శ్రీవారి సేవకులలో నన్నొకనిగా ప్రవేశపెట్టవలయునని ప్రార్థించు నంత వారతని బాహుభూజాసంపత్తులనుచూచి నీవుబైరాగివి పనికిరావని బైరాగులలో మంచిబలశాలివిగా కనబడుచున్నావని యని పరిపరి విధములుగా పరిహసించుచు తుదకు చేతికి గొడ్డలినిచ్చి అడవికిపోయి కట్టెలు తెచ్చునట్లు నియమింప శ్రీహాథీరాములవారు బ్రహ్మానందమని సమ్మతించి నాటినుండియు కమ్రశ్రద్ధాభక్తులతో నలుగురిమోత తానొక్కడేమోయుచుండెను. యిన్నాళ్లిట్లు సేవచేయుచుండినను శ్రీహరి దర్శన భాగ్యంబగుపడకుండుటచే తపస్సునకే గాని మరియేవేరువిధమైన సులభోపాయములేదని చక్కగా యోజించినవారై తపమాచరించ మొదలిడి 12 సంవత్సరములు ఘోరమైన తపమాచరించుచుండినను శ్రీవారి దర్శన మగుపడకుండుటంచేసి విసుగెత్తి యిచ్చట దేవుడు లేడనుచు, రామేశ్వరమునకు ప్రయాణమై బయలుదేరెను. దారిలో శ్రీఅనంత కళ్యాణగుణధాముండైన శ్రీనివాసుండు వృద్ధ బ్రాహ్మణవేష మున యెదురుపడి నాయనా యెక్కడికి వెళ్లుచున్నావనెను హాథీరాములు వారు శ్రీవారిదర్శన మబ్బుట కోసంబున అవ్వృద్ధుని మాటపెడచెవిని పెట్టి పోవుచుండ మరల వృద్ధుండడ్డగించి అతనివృత్తాంతము విచారించి నాయనా నీవు మహాభక్తుడవు. నన్నుమాట నాయందు గాఢప్రేమగలుగు చున్నది. నీవు యిచ్చోటు వదలిపోవలదు. అతిశీఘ్రకాలములో నీకు శ్రీవారి దర్శనము కాగలదని శాంతపరచి ఆవచనంబులాలించి మరల హాథీరాములచ్చోటనే మరల తపమాచరింప మొదలిడిరి.

ఇట్లు బాహ్యవిషయంబులందలి చింతంబును విడచిపెట్టి నిద్రాహారములు విసర్జించి యేకగ్రీవమైన తపమాచరించెను, కాని శ్రీనివాసునిదర్శన భాగ్యంబబ్బకుండుటంచేసి తపమునుచాలించి మరల రామేశ్వరమునకు పయనమయ్యె. మరల బాటనడ్డగించి ఆవృద్ధ కిరటనాట

శ్రీ వెంకటేశ్వరులు, శ్రీ హాత్తీరాం బావాజీ పాచికలాడుట.





కుండగు శ్రీనివాసమూర్తి హాతీరాములవారిని శాంతిపర్చి పయినం బాపి తన నిజస్వరూపమున ప్రత్యక్షంబయ్యె, హాతీరాములు ఆనంద బాష్పములుగారుచు బ్రహ్మానందభరితుండై శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించి నాటినుండియు శ్రీవారితో బంతులాడుకొనుచు పాచికలాడుచు ఆకులబక్షించుచు జరామరణములులేక యీశరీరముతోనే అంతర్ధాన మయ్యె చంద్రగిరినేలుచుండిన తిమ్మరాజుగారికొమారుండు వీరికిశిష్యుడై వీరికితర్వాత మఠాదిపతిగా వచ్చెను. ఆరాజులు యీమఠమునకు వక సింహాసనమును నౌబత్ ఖానా ఘంట మొదలగునవి యిచ్చిరి. శ్రీ హాతీరాములు జపముచేయుచుండిన మాలు యిప్పటికిన్ని మఠములో కలదు. యీమఠము తిరుమలమీాద ఆదిస్థానముగా వీరివల్లనే స్థాపింప బడినది. యీమఠమునకు తిరుచానూరు, వేలూరు, చిత్తూరు, వృద్ధా చలం, షోలింగర్, మధుర, తంజావూరు, నాసిక్, సుగూరుపంచవటి, భాగలకోట, బొంబాయి, ముజ్జేరిజిల్లా, అయోధ్యా, గుజరాట్, నాభా మొదలగు ప్రదేశములలో శాఖలు గలవు.

యీమఠములో వకదేవాలయమున్నది. యిందు సాలిగ్రాములు వందలకొలదిగలవు దేవతార్చన సాంగోపాంగముగా జరుగుచుండును. ప్రతిదినము సాయంకాలము గద్దీ (సింహాసనము) వద్ద వకపండితుడు సంస్కృతములో పురాణముచదివి హిందీభాషలో ప్రతిపదార్థము విని పించును, శ్రీ వేంకటేశ్వరస్వామివారి రథోత్సవంనాటి సాయంకాలము శ్రీమహంతులువారు వుపవాసముండి తేరుయథాస్తాన మలంకరించిన తర్వాత గాదులందాసీనులగుదురు. హాతీరాములవారు అంతర్ధానమైన స్థళమందు వారి సమాదినికట్టించి వారిహోమగుండము యిప్పటికిని ఆరిపోకుండ కాపాడబడుచున్నది. శ్రీహాతీరాంజీవారియందు మఠం శిష్యులకందరికిన్ని నమ్మకవిశ్వాసములుగలిగి నేటివరకు పాదకానుకలు చెల్లించెదరు. శ్రీహాతీరాంజీవారు తనశిష్యులకు స్వప్నములోకనబడి తమకష్టములు నివారించునట్లు చెప్పుచున్నారు. ప్రస్తుతం యీమఠము నకు శ్రీమహంతు ప్రయాగ్ దాసుజీవారు మహంతుగానున్నారు. వీరి శిష్యులలో నొకరు ప్రతినిధి "అధికారి" అనుహోదాతో సదా తిరుమలమఠములో నుందురు.



శ్రీ

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ కలియుగ వైకుంఠంబను

# శ్రీ శ్రీనివాస స్థలపురాణము.



శ్లో॥ శ్రీవేంకటేశశ్శ్రీనివాసో లక్ష్మీపతిరనామయః ।
అమృతాంశోజగద్వంద్యో । గోవిందశ్శాశ్వతఃప్రభుః ।
శేషాద్రినిలయోదేవః । కేశవోమధుసూదనః ।
అమృతోమాధవకృష్ణః । శ్రీహరిర్జ్ఞానపంజరః ॥

# నైమిశారణ్య ప్రభావము.

శ్రీనైమిశారణ్యమందు పుణ్యారణ్యమున సమస్త ఋషులు మునిపుంగవులు వేలకొలది భక్తులు తపమాచరించుచుండగా వ్యాస శిష్యుడను సూతమహర్షి నిగాంచి శౌనకాది మహామునులు అచ్చట యుండగల భక్తులందరు కరకమలంబులు ముకుళించి భక్తిపారవశులయి అతిథీనముగా ఋషిపుంగవా! భక్తాగ్రేసరా! సూతా! మీయొక్క అపారమైనటువంటి దయవలన సకలపురాణములును, శాస్త్రములును, విని మిగుల ఆనందభరితులమైతిమి. యింకయు యెన్నిమారులు శ్రీ స్వామివారి చరిత్రములువిన్నను వినవలయుననియే కుతూహలముగా యున్నది. కాబట్టి శ్రీ శ్రీనివాస స్థళపురాణమును మీచే మేము విన గోరితిమి. దాని నమూలాగ్రముగాజెప్పి మమ్ముద్దరింపవేడు వారమన, సూతుడు, మునిపుంగవులారా! యీనైమిశారణ్యమందు తపమాచ రించగలభక్తులందరు, భక్తపరాధీనుడగు శ్రీ శ్రీనివాసస్థళపురాణమును వినవలయునని నన్నింతదూరము ప్రార్థింపగా జెప్పుటకు నేను కంకణ బద్ధుడనైతిని. మీరు నన్నడుగబడినప్రశ్న యతిగొప్పదైనను మీరింత దడవు నన్నాశ్రయించినందులకు మీప్రార్థన నంగీకరిచి నామనస్సుకు దోచినకొలది నేనుజెప్పెదను మీకుశ్రద్ధాభక్తి సమన్వితులైవిని భక్తులు గండని యిట్లు చెప్పందొడంగె.



శౌనకాది మహామునులకు సూతమహాఋషి

# శ్రీ శ్రీనివాస స్థలపురాణమును చెప్పుట.



చ. అలగునభంబునుండి విమలాక్షరపంక్తుల రీతివచ్చునే।
నలసట జెందియున్నతరి నావనమందువసించి జ్ఞానముం।
గలుగగజేసి మానసవికారములందొలగించి జిహ్వపై।
నిలిచినటించుశారదను నిత్యమునన్నుతిచేయుచుండెదన్ ॥

మునిపుంగవులారా?

ఈప్రపంచమునందు సప్తద్వీపములలో వన్నెకెక్కిన జంబుద్వీపమునందు భరతఖండముయొక్క దక్షిణపార్శ్వమున తిరుపతియను పుణ్యక్షేత్రమొకటిగలదు. దీనిసమీపమున సుమారు 3 మైళ్ళదూరమున కుత్తరభాగమున శ్రీనివాసచలంబను పురంబుగలదు. దానిపై శ్రీ శ్రీనివాసమూర్తి నివసించియుండును. ఇప్పర్వతము రమారమి పూర్వ

పశ్చిమముగా ముప్పదియామడలు దీర్ఘమున్నూ, దక్షిణోత్తరముగా పదియామడలు వెడల్పున్ను, రెండు వేలఅడుగుల యెత్తున్నుగలిగి శేషాచలంబనుపేర ప్రసిద్ధికెక్కి అనేకభక్తులకానన్నమై ప్రసిద్ధికెక్కియున్నది.

దీని యుపరిభాగంబు వక్షంబున లక్ష్మీనిధరించియున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారు నివసించియున్న యాలయంబును మధ్యభాగమున అహోబిలక్షేత్రమును అంత్యమున శ్రీశైలక్షేత్రమును, శ్రీభ్రమరాంబాసమేతమల్లికార్జున స్వాములవారి యాలయంబును ( అహోబిల శ్రీశైలము కర్నూలుమండలములో నున్నది) నిమ్మాకు క్షేత్రములతో గూడినదై యీపర్వము మొదటిభాగమునందు ఆదిశేషునియొక్క పడగవలె గోపురారణ్యమును, పురమువలె అహోబిలమును పుచ్ఛము వలె శ్రీశైలమును నున్నవి. యీపర్వతముయొక్క మొదటిభాగము శ్రీవేంకటాచలక్షేత్రము, దీనిని సమస్తజనులున్ను కలియుగవైకుంఠం బని చెప్పుదురు. ప్రపంచమునందుండగల పుణ్యక్షేత్రములన్నిటిలో ఇది పరమోత్కృష్టమైనది. యేడుకొండలును నొకటివెంబడి నొకటియుండు టచే యీమహానుభావునికి యేడుకొండలువాడని నామధేయము గలిగినది, యీకొండలుచుట్టును అనేకభక్తులు తపమాచరించుచున్నారు యీప్రపంచమునగల నూటయెనిమిది క్షేత్రములలో యీవేంకటచలమునకు ననేక నామధేయంబులు గలవు. వానిలో ముఖ్యములైన వాని పేర్లను యిందువివరించెద.

## వృషభాచల ప్రభావము.

కం॥ సెలయేరులుకమలాకర । ములుబహుకాసారబృందములు
పూర్ణములై ।
కలికాలమునొకవిధముగ । బొలుపైప్రవహించునచట
బుధసేవ్యములై ॥

వృషభాసురుడను రాక్షసుడు కృతయుగములో నీపర్వతమందు శ్రీతుంబురుకోన మహాతీర్థమునందు తపమాచరించుచుండిన మునులను పలువిధముల బాధించుచుండెను. మునులు ఆబాధలకోర్వజాలక

శ్రీమహావిష్ణువును ప్రార్థించి ఈవృషాభాసురుడు యాతీర్థంబున నిత్య స్నానము చేసి శ్రీనృసింహస్వామి సాలిగ్రామములబూజింపుచు. పూజానంతరమున ఖడ్గముతో తనసిరంబును తానే నరుకుకొని యాశిరంబును నొకపుష్పముతో కూడా సమర్పించుచుండె శిరమును ఛేధించినవెంటనే మరల శిరము యధావిధిగా నమరిపోవుచుండెను యిట్లు అనేక సంవత్సరములు దేవతార్చన సలుపుచుండనంత శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షముకాగా నారాక్షసుడు దండప్రమాణంబులుగావించి తనకు మోక్షముగాని, స్వర్గముగాని, పరమపదముగాని యవసరములేదనియు నేను తమతో యుద్ధముజేయుటే నాయభీష్టమని యెరింగించెను. అందులకు శ్రీమన్నారాయణుడు వల్లెయని యుద్ధమునకు ప్రారంభించెను. రక్కసాధముడు అనేక మాయావేషములధరించి యనేక రధగజాశ్వములను సృజించి శీఘ్రమునపోయి దైత్యారిందాకె ఇట్లుతాకిన నారక్కసునితో యోరీ రాక్షసాధమా! నీతో యుద్ధముచేయుటమాని యిప్పుడే నీతనువును యమలోకమునకు పంపెదచూడు మన నారాక్షసుండు స్వామీ! పూర్వము హిరణ్యాక్ష, హిరణ్యకశ్యప రాక్షసులనెల్ల తమ చక్రముచే దునిమి వారికి మోక్షము కలుగజేసితిరిగదా? అట్లనే నేను మీ చక్రధారచే మృతినొంది మోక్షమును బొందవలయును. ఇదియునుగాక నే నీపర్వతముపైతపమొనర్చినందులకు యిదిమొదలు యీపర్వతమును నా పేరుతో పిలువవలయునని ప్రార్థింపగా వానివేడుకోలు కియ్యకొని వానిని సంహారించి నా పర్వతమునకాపేరుబెట్టి నాటిమొదలు నేటివరకును వృషభాద్రి యని పిలువబడుచున్నది.

## అంజనాద్రి ప్రభావము.

క॥ అలకాశినుండి వెలువడి । వలనుగ మాకొఱకు నందవరపురమందే ।
నెలకొని కులదైవతమై । యలరుచు మహిమలుచూడ మాంబనుగొలుతుజ్ ॥

పూర్వము త్రేతాయుగమున గేసరియను ఒక వానరరాజునకు అంజనాదేవియను భార్యయుండెను. వీరిరువురు యీపర్వతమునందు

భగవన్నామస్మరణచేసుకొని కాలము గడుపుచుండిరి. గాని వీరలకు పుత్రసంతానములేదనిమాత్రం కొంచము కొదువగాయుండెను. అందు లకు వీరు అనేకమైన యజ్ఞములు, దానములు జరుపుచుండిరిగాని, యేమాత్రము ప్రయోజనములేకపోయెను. తరువాత వీర్లు యీయొక్క చింతవలన ప్రాణత్యాగముచేసుకొనుటకు సంసిద్ధులైయుండ యీసంగతి నారదమహాముని తెలుసుకొని వీర్లచెంతకరిగి "మీరు ఋష్యమూకాద్రి కేగి యచ్చట తపంబొనర్చుచున్న మతంగముని నాశ్రయించిన మీకు సంతానముగలుగునని" చెప్పిపోయెను. తరువాత భార్య, భర్త లిరు వురు మతంగమహాముని నాశ్రమునకుజని మాకు సంతానముగలుగు నుపాయము గరుణింపవలయునని ప్రార్థింపగా, నామునీశ్వరుడంజనా దేవినిజూచి "ఓ అంజనాదేవి యీపర్వతసమీపమున నుత్తర భాగంబున కైలాసమను శివక్షేత్రమొకటి గలదు. దానియుపరిభాగం బున నారాయణగిరియనియొండుగలదు. నీవచ్చటికేజని యీస్వామి పుష్కరణిలో స్నానమాచరించిన భలవంతుండైన పుత్రుండుజనించు" నని పలికె అనంతరము అంజనాదేవి యచ్చోటికరుదెంచి తపంబొనర్చె. ఆపత్కాలమందు వాయుదేవుడు ఫలంబులొసంగుచుండెను. ఇట్లు జరుగుచుండ నొకదినంబున వాయుభట్టారకుండు తనవీర్యము నొక ఫలమునందుంచి యీమెకిచ్చెను. అంత నామె గర్భవతియాయెను. అందులకామె నేనేకాంగినై తపమాచరించుచుండ నాకెట్లు గర్భము కలిగెనని మనోవ్యాకూలముచే ప్రాణత్యాగమునొనరించ సంసిద్ధురాలై నుండ తత్సమయమున యాకాశవాణి ప్రసన్నురాలై ఓ యంజనా! నీవేలచింతించెదవు. నీకోర్కె యీనాటికి ఫలించినదని చెప్పి అంతర్ధాన మాయెను. యీవాక్కులువిని అంజనాదేవిసంతోషించి యూరడిల్లెను.

అంత యంజనాదేవిగర్భమున దేదీప్యమైన యొకశుభముహూ ర్తమున బాహుబలభుజంబులుగల నొక బలవంతుడగుపుత్రుడు జనించె. నాశిశువు యుదయంబున వుదయించివచ్చు భాస్కరభింభమును ఫల భ్రాంతిచే మ్రింగదలంచి నాశిశువు నాకసంబునకెగరి మ్రింగబోయెను. అదిగాంచి ఇంద్రుడు తన వజ్రాయుధముచే నాబాలునికపాల ప్రదేశ

మునవైచెను. అంత నాబాలుడాదెబ్బకు మూర్ఛనొందియుండ వాయుదేవుండు కోపించ ముల్లోకములు తల్లడిల్లెను. దేవతలు దిగ్భ్రమజెందిరి. తరువాత దేవతలందరు మూర్ఛయందున్న బాలుని చెంతజేరి మూర్ఛనుండి లేవదీసి యాబాలునికి అనేకమైన వరంబులనొసంగి యంజనాదేవిని బిలిచి అమ్మా! నీవీపర్వతరాజమున అనేకదినములుగా తపస్సు చేయుచుండినందువలన యీపర్వతమునకు నిదిమొదలు అంజనాద్రి యని నామముగలిగెను. అనిచెప్పి అంజనాదేవికి అనేకవరములనొసంగి అంతర్ధానమైరి. అదిమొదలు నాపర్వతమునకు అంజనాద్రియని పేరు గలిగెను.

## శేషాద్రి ప్రభావము.



క॥ వేంకటగిరి నాయకునకు । బంకజభవజనకునకును బరమాత్మునకున్ ।
శంకరవరమిత్రునకుగ । లంకవిరహితునకు మోక్షులక్ష్మీపతికిన్ ॥

ద్వాపరయుగమున శ్రీమన్నారాయణుండు లక్ష్మితో యేకాంతముననుండదలంచి ఆదిశేషునిబిలచి నీవీద్వారముననుండి నెవ్వరినింగాని లోనికిం బ్రవేశింపకూడదని యాజ్ఞనొసంగెను. అంత నాయాదిశేషుడామేరకు ద్వారముగాంచియుండెను. ఇంతలో వాయుదేవుడు విష్ణుదర్శనార్థమైవచ్చి లోపలికింజనప్రయత్నించెను. అంత శేషుడు విష్ణుదేవుడు రమాదేవితో యేకాంతముననున్నాడు. యిప్పుడు పోవుటకు వీలుకాదనినుడివెను. అందులకావాయుదేవుడు కోపోద్దీపితుడై ఓరీ! మూర్ఖానిన్నిప్పుడే శపియించెదజూడుమన శేషుడు క్రుద్ధుడై ఓరీ దుర్మార్గుడా నన్నేల నీవు శపించెదవు. భగవంతుడు నిద్రించుచున్నాడు. యెందరో దేవతలును, ఋషులును, అనేకవేలు భక్తులు యిచ్చోటికరుదెంచి మరలినారు. గనుక నీవు యిప్పుడు లోనికిబోవుటకు సాధ్యము

గాదని చెప్పెను. యిట్లిరువురు గొప్పశబ్దములతో తగవులాడుచుండ వీర్ల యొక్క జగడములను లక్ష్మీదేవి విష్ణుమూర్తి కెరింగించె. లక్ష్మీపతి వెంటనే యచ్చోటి కరుదెంచి వీరిరువుల సంభాషణలు గ్రహించి అంత శ్రీమన్నారాయణుండు శేషునిగర్వమడంపదలంచి ఓ! భుజగేంద్రా యీ భూతలమునందు అంజనాచలంబొకటిగలదు. దానిని నీ దేహముతో గప్పికొనుము. అప్పుడు వాయుదేవుడు నిన్ను బారదోలినయడల వాయువధికుడని యెన్నుదము. అట్లు చేయ లేక పోయినయెడల నీవధికుడ వని ముల్లోకములనెల్ల కొనియాడబడుదువు. అప్పుడుగదా మీ బల పరాక్రమములు లోకములో వెల్లడికాగలదని వచించె. అంతట శేషుడాప్రకార మొనర్చెను. అప్పుడు వాయువుఅచ్చోటికేగి తనపాదము మోపి యొకకొనవ్రేలితో ఆగిరిని గదలించి దవ్వున విసరివైచెను.

అంత దేవతులు, రాక్షసులు యీయొక్క వింతలను జూచుచు శ్రీమన్నారాయణమూర్తి చేసినవింతకు ఆశ్చర్యపడుచు నాటిమొదలు నాపర్వతమునకు దేవతలందరు శేషాద్రియనిపేరిడిరి. అదిమొదలు నా పర్వతమునకు శేషాద్రియని పేరుగలిగినది.

## కలియుగమున వెంకటాద్రి ప్రభావము.

క॥ నారాయణుడనువిప్రుం । ధారాధీశదపముసేసి హరిమెప్పించెన్ ।
ధారుణితత్కారణమున । నారయనారాయణాద్రి యనఘునమయ్యెన్ ॥

కలియుగమునందు యీపర్వతమునందు త్రిలోక కర్తయగు శ్రీమన్నారాయణమూర్తి లక్ష్మీదేవి సమేతముగా నివసించి భక్తులకు ముక్తియిచ్చుచుండుటచే అటువంటి జగద్రక్షకుడైన పరంధామునకు వాసస్థానంబై తన్ను యెవరు భక్తిశ్రద్ధలతో దర్శించెదరో వారియొక్క పాపములను పోగొట్టి అనేకవేలజనులకు ముక్తినొసంగి కాపాడు చుండుటచే యప్పర్వతమునకు వెంకటాద్రియని కారణముకలిగినది.

# వరహావతార ప్రభావము.



పూర్వకాలమునందు హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు అను యిద్దరు రాక్షసులు భూలోకమునగల భక్తులను హింసించుచు దేవలోకమునకుబోయి దేవతలను కష్టపెట్టుచు నేనే దేవుడనియు, నన్నే స్తుతించవలసినదిగా శ్రీమన్నారాయణ భక్తులకు అనేక కష్టములను కలిగించుచుండె. దేవతలు ఆకష్టముల కోర్వలేక శ్రీ మహావిష్ణు చెంతకరిగి మొరలిడిరి. తరువాత శ్రీమన్నారాయణుండు త్వరలోనే వానిని సంహరించెదనని దేవతలకు అభయమిచ్చి పంపివేసెను. తరువాత శ్రీమన్నారాయణుని నాభికమలమందు బ్రహ్మనుద్భవింపజేయ నాచతుర్ముఖుడు వారియాజ్ఞగైకొని సచరాచర సర్వప్రపంచమును సృష్టించినవాడాయెను. ఇట్లుండ నాకాలమున హిరణ్యాక్షుడను రాక్షసుడు భూమిని చాపగాచుట్టి తెచ్చి సముద్రమున బడవైచెను. అంత నాతడు రసాతలమునకుబోయి ఆనందపరవశుడైయుండెను. అప్పుడు సమస్తమును జలార్ణవమై పెక్కు సంవత్సరములు తిమిరమునిండుకొన శ్రీమహావిష్ణు యాజలముపైన చిన్నబిడ్డయై వటపత్రమున యోగనిద్రవహించియుండెను. అంత బ్రహ్మ శ్రీమన్నారాయణుని సందర్శించి భూలోకమునగల భక్తులకు హిరణ్యాక్షునివలన గలుగు బాధలన్నియు వివరించి సత్వరముగా భక్తులను కాపాడవలయుననికోరెను. అంత శ్రీమన్నారాయణుడు అతిక కోపోద్దీపితుడై పునస్సృష్టిచేయుదలచి శ్వేత వరాహరూపంబున పాతాళమునకుబోయి ధరిత్రిని పైకెత్తెను. అప్పుడు హేమాక్షుడను రాక్షసుడు శ్రీమన్నారాయణునితో యుద్ధమొనర్ప వరహావతారముననున్న శ్రీహరి ఆరాక్షసుని తలదునిమి హతంబొనర్చె. అంత దేవతలు గంధర్వులు శ్రీహరికి పుష్పవర్షములు గురిపించిరి. అంత నావరహావతారమెత్తిన శ్రీహరి తనకోరలచే భూమిని పైకెత్తెను. నీటిపైకి తేబడిన నాధరిత్రినిగాంచి దేవతలు, ఇంద్రాదులు, ఋషులుపావన్మాం

నమో నారాయణేతి స్వరంబుల గీర్తించిరి. కుసుమవృష్టి గురిపించిరి అంత యథాస్థానంబున భూమిని నిల్పి బ్రహ్మచే మరల సృష్టిచేయ నాజ్ఞాపించెను. అప్పుడు సమస్త దేవతలు హరిని పెక్కు తెరంగుల నుతించి యిందే నివసించి భూలోక వాసులకు దర్శనము నొసంగవే దేవదేవా! యనివేడగా యట్లే యిందు నివసించి యెల్లరను నిజ నివాసంబుల కనిపెను.



## గరుత్మంతుడు వైకుంఠమునుండి కిరీటపర్వతమును దెచ్చుట.

అంతట సన్నిహితుండై మ్రొక్కుచున్న తార్క్ష్యునిజూచి హరి యిట్లనియె

క॥ ధరణియునీటన్మునిగిన। కారణమున దాని నెత్తుకార్యము కొఱకై।
ఘోరపురూపముదాల్చితి। నీరూపముజూచి లక్ష్మివెఱచును గరుడా॥

ఓ గరుత్మంతా! నేనీరూపమెత్తి హేమాక్షుని సంహరించి నా యొడలంతయు రక్తపూరితంబైయున్న కారణముచే నన్ను జూచిన లక్ష్మి వెఱచును నేను వైకుంఠమును బ్రవేశింపను కాన నేనీ భూలోకమందే వసించెదను. అనవుడు గరుత్మంతుడు స్వామీ! తమయొక్క

ఘోరపు రూపుజూచి రమాదేవి వెరసరనిచెప్పెను. అంతట విష్ణువు నేనీలోకమందే వసింపనెంచితి ఇందునిలచి దుష్టనిగ్రహము శిష్టపరి పాలనం బొనర్చువాడ కాన నీవు వైకుంఠమునకుబోయి శ్రీదేవికిజెప్పి కిరీడగిరిని దెమ్మని బుత్తెంచెను. అంత గరుత్మంతుడు వైకుంఠమునకరిగి యేతద్వృత్తాంతంబంతయు నెఱింగించి సిరికిబ్రణమిల్లెను. పిమ్మటట్లయిన యా యద్భుతావతారమును నేనున్ను జూడవలయును నేనిప్పుడే యచ్చటికి రాదలచితిననెను. అప్పుడు లక్ష్మీదేవి పరివారంబులతో యొక్కొక్కకళవంతున క్రీడాద్రిని నారోహించి పక్షీంద్రుడుభూలోకము నకుదెచ్చి వరాహస్వామి జూచిన దివ్యక్షేత్రమగు స్వామి పుష్కరిణికి పశ్చిమతటంబున నిల్పెను. అంతట భగవంతుడుత్కృష్టిజెంది శ్రీభూదేవు లతో నావిమానము పై గూర్చుండె అంత ఇంద్రాది దేవతలు స్తుతించిరి హరి శాంతమువహించి వారికి దర్శనంబులొసంగి వారివారి విమానం బులను బుత్తెంచె ఇట్లు భక్తపరాధీనుండగు శ్రీమన్నారాయణమూర్తి యీకలికాలంబున తన్నుదర్శించుమానవుల కైహికాముష్మికసుఖంబుల నొసంగుచు యిందు నివసించియున్నాడు గాన నది మొదలీ క్షేత్రమునకు వరాహక్షేత్రమనియు పొగడబడుచున్నది.

## నారదుండు కశ్యపాదిమునుల యొద్దకు పోవుట

శ్రీయఃపతి శ్రీభూనీళా సమేతుండై వైకుంఠములోనుండు నిత్య సురులనుజూచి వారినాదరింపదలచి ప్రయాణ సన్నద్ధుండుకాగా వేంక టాచలములోనుండు ఆదివరాహమూర్తి విశ్వకర్మచే నిర్మింపబడిన పట్టణమున బ్రవేశించి స్వేచ్ఛగా విహరించుచుండెను. ఈవృత్తాంత మును నారదుండు దెలిసి తనతండ్రియగు బహ్మతోజెప్పెను. పరమేష్టి విచారించి శ్రీమహావిష్ణువు తన మహిమ భూలోకములో జూపనియెడల మనుజులు సత్కర్మానుష్టాన తత్పరులుగాక పాప భూయిష్టులగుదురు కాన యెవ్విధినైన యచ్యుతుని భూలోకమునకు నీవు రప్పింపవలయు ననెను. బ్రహ్మపలుకులువిన్న కలహాసనుండు వెంటనే భాగీరథీ తట మున యాగము జేయుచున్న కశ్యపాదిమునుల యొద్దకరిగి మీ రాచ

రించు యజ్ఞఫలము నెవరికిత్తురని ప్రశ్నించెను. అందులకా మునిపుంగవులు యేమియు దోపక యూరకుండిరి. అంత నారదుడు త్రిమూర్తుల లో నెవ్వరు సత్వగుణవంతులో వారికాఫలంము నిండనిజెప్పి తాను త్రిలోక సంచారమునకై బోయెను.



## భృగుమహర్షి త్రిమూర్తులను శోదించుట.

అంత భాగీనథీతీరమున యాగ మొనర్చుచుండిన ఋషులు యిక్కార్య మెవరివలనఁదీరఁగలదని కొంతవడి యోచించిరి. పిమ్మట యెల్లరు దీనిని నెరవేర్చుకర్త భృగుమహర్షి యే యని నుడివిరి. పిమ్మట వారి యాజ్ఞబూని భృగుఋషి సత్యలోకమునకుంజని యచట సమస్త బృందారకముని పరివేష్టితుండై కొలువునున్న విదాతలంగని వినతుండై వారియుత్తరవులేకనే యాసనము నధిష్టించెను. దానిఁగన్న బ్రహ్మ కోపంబు పెల్లున బలుకకయుండెను, అంతటభృగుమహాముని బ్రహ్మను రజోగుణ ప్రధానవంతుఁడని దలఁచి యితనికి భూలోకము నందాలయము లేకుండుగాకయని శపించి యచ్చోటువదలి వెంటనే కైలాసంబుఁ జేరెను. అచ్చట యుమాసహితుండై శంకరుడేకాంతంబుండెను. భృగువు తీవ్రముగా వారిఁజేరి వీక్షించుచుండెను. పరులుప్రవేశింపని కాలము

గాన పార్వతి మిక్కిలి లజ్జచే శిరము వంచుకొని యొకమూల నొదిగి యుండెను. దానింగన్న శివుడు భృగువుతో బలుకక మిన్నకయుండియు ఇట్టి రహస్యస్థలంబున కిమ్మునీంద్రుడు రావచ్చునా? అని నాయుగ్రుడుగ్రముగా వీక్షింప నదిగన్న భృగువు ఇతడు తమోగుణ ప్రధాన్యుడని యెంచి యితనికి లింగపూజ యగుగాక యని శపించి యప్పుడే వైకుంఠమున కేగెను.



## భృగుమహర్షి వక్షస్థలంబున దన్నుట

అక్కాలమున విష్ణువు శేషతల్పంబుపై శయనించియుండెను. భృగువు తూర్ణముగా నాదేవదేవుని తల్పము సమీపించి శయ్యపైనున్న హరి వక్షస్థలంబున తనపాదంబులతో దన్నెను. వెంటనే రమానాధుడా బ్రుషిపుంగవుని యో ఋషిశ్రేష్ఠా! మీరాకచే నా పురంబును నామందిరంబును పవిత్రమునొందెను. మిమ్ము దర్శించుటచే నాజన్న పవిత్రతఁ జెందును నే గృతార్థుడనైతిని. మహాత్మా! వజ్ర సన్నిబంబగు నావక్షస్థలంబున మృదుసన్నిబంబగు మీపాదకమలంబున నన్ను దన్నుటచే యెంతనొచ్చెనో? ఎంతకందెనోగదా యని చింతించి తన కేలుదామరతో నామునిబృందారకుని పాదకమలములను నొత్తుచు

నాయపరాధమును సైచవలయునని వేడుకొనియెను. మరియు మృదు మధుర వచన రచనులతో నుతించి నోదార్చెను.

క॥ కరవిప్రుల పద రేణువు। దిరముగ శిరమున ధరించు దేవుఁడవతో విూ।
చరణంబురమున సోకగ పరమపవిత్రుండ నైతి బ్రాహ్మణవర్యా॥

ఇట్లు హరి పల్కఁగా విని మునీంద్రుఁడు మిక్కిలి భయభక్తి విశ్వాస వీప్రీహిచే నావిష్ణుని డిలకించి యిట్లని నుతించె.

దేవా! నీవు మహానుభావుఁడవు నిన్నుబొగడ ముప్పదిమూఁడు కోట్ల వేల్పులేజాలరన్న నేనెంతటివాఁడ ఔరా! నేనెంత యపచారం బొనర్చితి ఓ పురాణపురుషా! అభవా! ఆర్తత్రాణ పరాయణా! నేను రోషావేశవశుండనై కన్నుఁమిన్ను దెలియక శ్రీవారికి మహాప రాధంబొనర్చితి కాన నన్ను మన్నించి రక్షింపుమని బలువిధముల వినుతియొనర్చి హరిని ప్రార్థించుచు వారిచే యాజ్ఞనుగొని భృగు మహర్షి గంగాతటంబునకేఁగి యచ్చట కశ్యపాదిమునీశ్వరుల కాసంగతి నెల్ల నెఱింగించెను. వారెల్లరు సంతసంబొంది సత్వగుణ ప్రధానుండగు హరికే వారుచేయు యజ్ఞఫలంబు లొసఁగి శ్రీమన్నారాయణుడే ముక్తి ప్రధాతయని ధ్యానము సల్పుచుండిరి.

## లక్ష్మి విష్ణువుతో కోపించి కొల్లాపురము జేరుట.

భృగు దన్నినపుడా వక్షస్థలంబుననున్న కమల శ్రీహరిని గాంచి నాధా! నీవు సకల లోకనాధుండవు సమస్త సచరాచర పరబ్రహ్మ స్వరూపుండవు అట్టి నీయురంబునందు నేను వశించియుంటినిగూఁడ దలపక నాజడదారి కన్ను గావరంబున నిన్నుఁ దన్నెను. అతఁడిట్లు చేయుట మీకు సరిపడెనుగాని నాకుఁ సైపకున్నది అయిన నాముని వరు నేమిజేయుటకును నాకు దోపకయున్నది. నేను నీ యురంబు వీడి రయంబున నెటకేనిబోయి నీపాదారవిందముల నామఃకమలంబు నందిడి తపంబొనర్చెదనన నపుడు రమాదేవింగాంచి పద్మాక్షుఁడు ఓరమణీమణీ! యేల నకారణంబుగా నలుకఁజెందెదవు అమ్మునివరుఁడు మనలు నక్రమముగా దన్నినాఁడని దలంపకుము మన సత్వ గుణమును శాంత శమదమును పరీక్షించుటకై యిట్లు చేసె. మన

కును శుభంబులొదవె. ఇంక నీవు గోపింపవలసిన కారణము లేదనెను. అంత రమాకాంత పదింతింకించి" నాథా! మీరు సకల జగద్రక్షకులు! పరమాత్ములరు అని దెలిసియు నీయురంబు గరంబను గ్రహించి, అట్టి యురంబున నామాఖ్యుడు పాదతాండనంబు చేయుటలో మీకు శుభంబమరె అట్టిపానిందలంప నామనంబు సకింపురాదు. కాననిన్ను దన్నిన మునిని శిక్షించుటకు వెఱచి నన్నుతిలఘువుగా చూచితివి కాబట్టి గోపాలకులందు గొట్టడిచే నిన్నుగొట్టుగాక! ముందునందవనములో వన కాంతనుగాంచి వరింతువు వారు నిన్ను ఱాలచే రువ్వుదురుగాక! యని చెప్పి యింక నేనెటకేని యేగెదను నీయొక్క సత్వగుణ శ్రేష్టత్వమే నన్ను మిమ్మొడబాపెను నేనిపుడు కొల్లాపురముబోయి యందు వశింతునని వెంటనే కొల్లాపురము బ్రవేశించెను. అది మొదలిది వరకు నాపురంబున కొల్లాపురలక్ష్మియని వెలసి సమస్త భక్త పుంగవుల కామితంబుల కల్పవల్లి చందంబున తూర్ణముగా బూర్ణముగావించుచు భక్తజనమతల్లియని నెగడ బొగడ్తగాంచెను.

## శ్రీమహావిష్ణువుభూలోకమునకువచ్చుట.

లక్ష్మి తనుఁబాసినవెంటనే శ్రీహరి చాల చింతాక్రాంత చిత్తంబుతో తత్తరంబంది మరల లక్ష్మితో గలసికొననెంచి వైకుంఠమువదలి వేంకటాచలమునకువచ్చి విధినిర్మితంబై నున్నతంబగు వల్మీకములో వసించియుండెను. ♦♦♦ లక్ష్మీదేవి కొల్లాపురములోనుండి శ్రీహరి తన

---

చింతచెట్టు వల్మీక మహాత్మ్యము.

♦♦♦ విష్ణువు వైకుంఠమును వదలి భూలోకమునకువచ్చి యెచ్చటనైన వశింపక యీచింతచెట్టు చెంతనున్న వల్మీకంబున వసించియుండుటకుఁగారణమేమనిన బూర్వము త్రేతాయుగమున దశరథమహారాజు దేహముక్తికాలమున పుత్రుండైన శ్రీరాముని బాయజాలని మోహముచే రామరామయని మృతినొంది దివంబునకేగెను. కౌసల్యయు నాతీరుననే తనువు త్యజించెను తర్వాత ద్వాపరమున వసుదేవ దేవకియు నిర్యాణమునందు శ్రీకృష్ణునియందు పుత్రవాత్సల్యముతో నేత్రాణ

కొరకై భూలోకమునకు వచ్చిన వృత్తాంతము తన జ్ఞానదృష్టివలన దెలిసికొని చింతించుచున్న సమయమున బ్రహ్మరుద్రులు గోవత్సరూపము ధరింప లక్ష్మి యెదుట నిలిచిరి. అపుడు లక్ష్మీ పరమానందము నొంది తానొక గొల్లభామ వేషముధరించి గోవు దూడను అమ్ము నెపమున చోళరాష్ట్రమున జాటించెను. ఈసంగతి చోళరాజు భార్య దెలిసి తన పరిచారికులచే గోవుత్సవము గొల్లభామయును తన నగరు లోనికి రప్పించెను. అంత నారాజకాంత యాగోవును దూడను దీని కొన్న మనబాలకులను క్షీరము తక్కువలేక యుండునని దలచి యా గొల్లభామకు అపారమగు ధనమిచ్చి గొల్లవానిబిలిచి తినకున్న రెండు వేల పశువులలో జేర్పించి నాధేనువును జక్కగా కాపాడుడని జెప్పెను.

అంత నాగోవు రెండువేల గోధనంబులతో నేగి ప్రతిదినము మేయుచు శేషాద్రినెక్కి చింతచెట్టు చెంతనున్న యెత్తైన పుట్టలోనున్న హరిని తన స్థనమునందున్న క్షీరముచే దృప్తిపరచుచు వచ్చెను. ఈసంగతి లక్ష్మి దెలిసికొని యింక వాసుదేవుడు సుఖించిన జాలునని తనమనంబున సంతసించుచు మరలి కొల్లాపురము జేరెను. చోళపత్ని దాగొన్న గోవునందు క్షీరములేని యున్కిగని గొల్లవాడు దీనిపాలు

---

ముత్యజించిరి. ఈసూత్రము నెరింగిన వానిభర్త వారి మోహపాశమును దాల్ప యోచించి వారి ఇరువుర యంశములచే తింత్రిణివృక్షమును వల్మీకమును నిర్మించి తల్లి గర్భంబున పుత్రుడు వృద్ధియగునట్లు యీపుట్టయందు పదివేల సంవత్సరములు వసించియుండెను. కాబట్టి చింతచెట్టు దశరథమహారాజు కౌసల్య వాల్మీకంబు లక్ష్మణుడే పన్నగాచలంబు సరయూనదియే స్వామిపుష్కరణి అయోధ్యానగరంబే వేంకటాచలము వాల్మీకివాసియే శ్రీనివాసులు లేక రామచంద్రుండు ఆవృక్షమే వసుదేవుడు వాల్మీకమే దేవకీదేవి, బలబద్రుడే పన్నగాచలము, యమునానదియే స్వామిపుష్కరిణి, మధురానగరమే వేంకటనగరము హరియే కృష్ణమూర్తి లేక వైకుంఠమే వరాహ భూదరంబు విరజానదియే సువర్ణముఖి శ్రీమన్నారాయణ మూర్తియే శ్రీనివాసులు ఇట్లవతరించి నిత్యముక్తులు ఖగమృగంబులై సేవింపగా దేవతలకు తన లీలావినోదంబుల జూపుచుండును.

నపహరించుచున్నట్లు దలచి వానిబట్టి కట్టికొట్టగా వాడు మిక్కిలి వెతలంజెంది మరునాడాగోవును గనిపెట్టి తిరుగుచుండ యెప్పటి తింత్రిణీ



పుట్టలోనుండు శ్రీహరికి కరియావు తిరుమంజన అభిషేకము చేయుట,

గోపాలుడు కనిపెట్టుట.

తరువు క్రిందనున్న వల్మీకములోనుండు శ్రీయఃపతికి పాలను జార విడుచునది జూచి గోపకుడు ఆగ్రహముతో నాగోవును గొడ్డట గొట్ట బోవుసమయమున తనకు తల్లివలె క్షీరము నిచ్చుచున్న ధేనువును రక్షింపగోరి శ్రీపతి తనశిరమునిచ్చి యాదెబ్బను సంగ్రహించుకొని యాగొల్లవానింగని ఓరీ దుష్టవర్తనా! ఎంత దారుణ కృత్యమునకు సాహసించితివిరా! అకటకటా నేనీ గోవుశిరంబున కడ్డముగా నాతల బెట్టకయున్నచో నిప్పుడే యిది హతంబైయుండునుగదా! దుష్టాత్మా! నీవంటి నీచవర్తనులు పుడమి భారంబునకేగాని యొందుగాదు. అని యనునంతవరకు నాగొల్లండు గడగడవణకుచు నేలబడి మడిసెను.

అంతట గోవు భయాకులిత స్వాంతమై కన్నీరు విడుచుచు రుధిరముతో నాచోళభూపాలుని గృహంబునకు జన రాజాశ్చర్యముతో గోవునుంగని యాగోవువచ్చినమార్గము వెంబడించిపోవ నది పూర్వము చనిన రీతిని నావాల్మీకము చెంతకు గొనిచన నచ్చట జరిగియుండు

ప్రమాదమునుజూచి నెఱగుపడి వీడు విగతజీవుఁడై యుండుటకు గతం బెయ్యది! ఇయ్యెడ రక్తప్రవాహము గలిగియుండు హేతువేమియుఁ దెలియలేదని ప్రధానితో నాలోచించుచుండ నంతలో వల్మీకము నుండి శ్రీనివాసుఁడు వెలికివచ్చి చోళరాజుంగాంచి:—

## చోళరాజునకు హరి శాపమిచ్చుట.

"ఓ పుడమిఱేడా! నన్ను తల్లివలెఁ బ్రతి దినము క్షీరమిచ్చి రక్షించుచున్న నియ్యావును నీగొల్లడు గొట్టబోవగా దీని రక్షింప నెంచి నేనడ్డము వచ్చితి ఆదెబ్బ నాశిరముపై దగిలె వాఁడు నన్ను గొట్టిన పాపమునకుఁ దగినశిక్ష యప్పుడే యనుభవించె నీవిక వాని కధిపతివి గాన నాపాపంబు లీవును ననుభవింపుము ఓ రాజా! నీవును నీభూతలమున పిశాచమై పోవుదువుగాక" యని శపించెను. అంత నా భూకాంతుడు మిక్కిలి భయాకులిత స్వాంతుడై తత్తరంబున చిత్తంబు తత్తరంబొంద నేలవ్రాలివివశుఁడయ్యెను. కొంత తడవునకు రాజు మూర్ఛదేలి లేచి శ్రీనివాసుంగాంచి భయభక్తి వినయంబులు నివ్వటిల్ల సాష్టాంగ దండప్రణామంబు లాచరించి "ఓ దేవదేవా! ఆప ద్బాంధవా! అనాథరక్షకా! ప్రణతార్తిభంజనా! అనన్యశరణా! క్రాంతుడనగు నీయ్యావన్నని రక్షింప నీకన్న నోరులుగలరే! ఓ పన్నగశాయీ! నేని యపచారము నాబుద్ధి పూర్వకముగా జేసియుం డనుగదా! నిరపరాధుండను అట్టి నాయందిట్టి తప్పిదము నారోపించి నిష్కారణముగ నన్ను శపింపనగునే! యనీ వారిపాదంబులపై వ్రాలి యనేకవిధముల స్తుతించి మఱియు నిట్లనియె.

తే॥ అకట పిచ్చుపైన బ్రహ్మాస్త్రమన్న విధముదోఁపఁగ నన్నిట్లు
వృధశపింప వలయునే దీని నెవ్విధి యనుభవింప నేర్తు నయ్య
యెా నన్ను బ్రోవు నీరజాక్ష ॥

శా॥ పాలింపందగు కర్త వీవనుచు నాభావంబులో నమ్మి నీపాలం
జేరితినయ్య యిప్డు వరుసంబాలింపు శ్రీనాయకా । పాలన్నమ్మం
చిన నీటముంచిన సరే భావంబు నీదాట నాకేల న్వేరొక
చింత జెందఁగను బ్రంహేంద్రాది సంసేవితా॥

తేదేల? నీవెందులకై వైకుంఠమును వదలివచ్చితివి! నీవేల మనుష్యావతారమూనితివి? మీశిరంబున గాయమెందులకయ్యె? ఏల ఇట్టి దీనదశచే నుండుచున్నారు. ఎందు కీర్తి వెలుగుపడిన వానివలె తత్తరంబందెదరు? అయినను మీరున్న యునికింగాంచిన నామనంబున మిక్కిలి చింతపొడముచున్నయది కాన మీచిత్తంబునంగల నెవ్వగలం దెల్పుడు అనఁవుడు రమాపతి వరాహస్వామినిజూచి. ఓవరాహా! నాయుదంతంబంతయు నీ కెఱింగించినచో నీవును చిత్తంబున దత్తరం బందెదవు కారా? నాశ్రమలఁ గొంత నీకెఱింగించెద. నాలకింపుము నేరమా సమన్వితుఁడనై శేషతల్పముపై బవ్వళించియుండ భృగుమహర్షి యరుఁగుదెంచి నావక్షస్థలంబునదన్నె దానింగాంచిన లక్ష్మి నాయందు నలుకబూని కొల్లాపురంబున కేతెంచెను. అంత లక్ష్మి వియోగదెప్పరముచే నేను వేంకటాచలమందలి చింతచెట్టుచెంతనున్న పుట్టయందు వసించియుండ నొక గొల్లదరుదెంచి గొడ్డఁట నాశిరంబున గొట్టెను. కాబట్టి ఈగాయమునకు దగినమందు నరయుచు నేనిట వచ్చినాఁడను. ఇట్టి బెట్టిదంపుగు దెబ్బచే సొక్కియున్న హేతువుచే నిన్నుంగాంచి నేనీ పొదరింట దాగితి. అయిన నాకెవ్వరును దిక్కులేదు. నే పడు సంకటముల నెల్లను నీవఱిసితివి. కాన నాకొక చోట స్థలమిమ్ము. అందు నివసించెద, నన వరాహస్వామి శ్రీనివాసుని గాంచి అయ్యా! మీరు చెప్పిన వాక్యము బహువింతఁగా నున్నది. బీదలకు చోటిచ్చుట నభాగ్యముగదా? బలవంతులకు చోటిచ్చుట ప్రమాదముగదా? అయిన నీవడిగితివి. నీకు లేదనక నిచ్చెదగాక. ఆస్థలంబునకుఁ దగిన మూల్య మిచ్చినచో నొసంగెదను అనెను. అందులకు వాసుదేవుఁడు వరాహస్వామినిఁజూచి వరాహా! లక్ష్మి నెడబాసి యొంటరిగా దిరుగు ననుబోంట్లకు ధనమెట్లువచ్చు? నాసన్నిధిని లక్ష్మియున్న నాకేమి కొఱఁత? నీవు నాయందు దయయుంచి నాకు గొంతస్థళ మిచ్చినచో నే నామేలును మరువను సుమా అనెను.

అంత వరాహస్వామి హరింగాంచి ఓ రమారమణా! కలిమి చెలిమి యెంతయున్నను అనఁగా ఆహారపట్లను వ్యవహారపట్ల నెంతమాత్రము మోమాట ముంచరాదన్న సామెత వినవా? కాన మీరు ద్రవ్యమివ్వక నేనెట్లు, మీకు స్థళమొసగుదును. నేనివ్యాజాల

ననవుడు శ్రీనివాసుడు ఓంకారస్వరూప! ధరాతలమంతయు నీస్వాధీనంబు గావున నాయందను రక్తిచే నాకు నూఱుడుగులు భూమినొసంగితివేని నిన్నెన్నప్పుడు మఱువను నీవుజేసిన నుపకృతి నే నెన్నటికిని మఱచు స్వభావముగలవాడనుగాను. నీవిచ్చిన స్థళంబునందు వసించియే జీవనంబు జేసికొనియెదను., మఱియు సమస్తదేశవాసుల రావించి నే వారిచే ముందునీకు పంచామృతస్నానము చేయింతును. నీదర్శనమైన పిమ్మట కానుక చెల్లునట్లు చేయుదును. ఈతీర్థమునందెల్లరు తీర్థమాడి యర్చనాది కార్యము లెల్లను ముందునీకు సమర్పించునట్లు యెల్లజనుల కనుజ్ఞ యొసంగెద "ననవుడు వరాహస్వామి సంతుష్టితస్వాంతుడై శ్రీనివాసునిగాంచి రమారమణా! నీమనంబునగల నేనిట్లంటినిగాని యొండుగాదు. నీ వాక్యామృతంబున నామనంబునందానందంబువొడమె. నేను ధన్యుడనైతిని. నీకువలసినంత స్థళమిచ్చెదరమ్మని నూఱడుగుల మేర స్థళంబొసంగెను. అంత శేషాచలంబున నిల్చెను. అప్పుడిర్వుర మౌళిభాగములందు విభుధులు కుసుమవర్షము వర్షించిరి.

అంత వరాహస్వామి తనచెంత పాక చారిణియైయున్న వకుళమాలికను హరికి నన్నపానములకును ఔషధమును మున్నగు వివిధోపచారమును చేయునట్లునుగ్రహించెను. ఇట్లు, వకుళమాలిక షడ్రసయుక్తమగు పంచభక్ష్య పరమాన్నాదులతో హరిని తృప్తిజెందింప జేసి గాయమునకుదగిన యౌషధమును బట్టించుచుండెను. ఇవ్విధిగా వకుళమాలికచే వివిధోపచారములు మిక్కిలి జాగరూకతతో గైకొనుచు శ్రీనివాసుడు సౌఖ్యమనుభవించుట గని ధేనుకావత్సంబుల యాకారంబు ధరించియున్న విరించియు శంకరులును యథేచ్ఛ దమ నివాసంబుల కరిగిరి.

అంత హరి నాగిరియందు ననేక వినోదంబులం జూపుచు భక్తరహితులకు మోహకుడును, పరమ భక్తవరులకు సౌఖ్యానందుడై, దుష్టులకు నాశంకరుడై రాక్షసులకు భయంకరుడై, దేవతల కనేక వినోదంబులంజూపుచు, మౌళిభాగమునందలి గాయముచే విముక్తుండై దివ్యలావణ్య సౌందర్య లీలామానుష విగ్రహుడై తల్లిపొంత మురిపెములు చూపు బాలునివలె వకుళమాలికాదేవి చెంత వసించియుండెను.

# వకుళమాలిక పూర్వజన్మ ప్రకారము.

ఈమె ద్వాపరమున శ్రీయశోదావతారమున శ్రీకృష్ణుని యందలి యమితప్రేమపాశముచే పోషించుచుండియు దనివిచనక న దే[illegible]హము వెల్లున దేహము త్యజించెను. ఆ ఋణానుబంధముం గనిన క[illegible] ఢీజన్మమందు వకుళమాలికగా గల్గించి వరాహస్వామివద్ద నుని[illegible] ఆవకుళమాలికనే యిప్పుడు నాకోరిడస్వామి శ్రీనివాసునికి సమర్పించెను. ఈమె యశోదాంశ సంభూతురాలు.

# పద్మావతీ దేవియొక్క జననము.

శ్రీనివాసులు పుట్టయందు వసించియున్న కాలంబున నారాయణ వనంబున ఆకాశరాజు పరిపాలించుచుండెను. నాతేడు ధరణీ దేవియను నామెను వివాహమాడి చిరకాలము సంతానములేక వగంజెంది "అపుత్రస్య గతిర్నాస్తి" యను స్మృతి వచనము చొప్పున సుతులు లేనివానికి గతులులేవను నార్యోక్తిని నే నేమి చేయుదునని భగవంతుని బలువిధములం బ్రస్తుతించుచు వచ్చెను. సర్వతీర్థ సేవనం బొనర్చుచు శ్రీరంగము, వేంకటాద్రి, కాంచి, తోతాద్రి, శ్రీగిరి, అహోబిలము, జగన్నాథము మొదలగు దివ్యక్షేత్రంబుల సేవించియు వివిధ వ్రతంబులుం చేసియు సంతానంబు గానక సురగురుని దర్శించి నమస్కరించి 'ఓగురువర్యా! మీకరుణాకటాక్ష వీక్షణముచే సకల సుఖములు గలిగియు సంసార సౌఖ్యమున కాలవాలంబగు సంతతిగానక యున్నాడను గదా! నేను విరాగమూని విపినంబున కరిగి తపంబు చేసెదననిన యాపుడమిఱేనిం గాంచి సురార్యుం డిట్లనియె.

"వత్సా! వగవంబనిలేదు నీకు దివ్యస్వరూపులగు సుతులుదయించెదరు. కాన త్వరగా పుత్రకామేష్టిం గావింపు" మనవుడు సంతసించి వల్లెయని పుత్రకామేష్టిజేయ నుద్యుక్తుడై మున్నందు శుభముహూర్తంబున బంగరు నాగలిచే ధరణిం దున్నించగా నందొండొక కాంచనాబ్జ నాగలింతగిలికొని పైకివచ్చెను. దానిం గన్న రాజు మిగుల సంతసించి సత్వరము దానిం దెచ్చిచూడ నందు సర్వలక్షణ

సంపన్నత గలిగియున్న యొకబాలికఁగాంచి పెన్నిధింగన్న పేదవలెను. చంద్రునిగన్న చకోరంబు భాతి యానందరస నిమగ్నుఁడై పుడమి వేల్పులరావించి వందనంబిడి యావద్వృత్తాంత మెఱింగించి నా కన్నియను వారలకుఁజూపుచున్న సమయమునందశరీరవాణి ఓభూపుంగవా! ఈలావణ్యవతిని నీవు కడుగారాబముతో పోషించుము, నీకు మీద లగ్గగు ననవుడుఁ నందఱు నత్యాశ్చర్యమునొందిరి, పిమ్మట నొడయునింగాంచి భూసురులు శ్రీహరివలన నీ కయోనిజయగు తనయ గలిగె. ఓరాజా నీభాగ్యమేమనవచ్చును? నని యెల్లరు గొనియాడి రాజు నాశీర్వదించిరి. ఈమె పద్మసంభవ యగుటంబట్టి పద్మావతి యను నామంబీకన్యకకు జెల్లుననిరి. భూసురులు రాజువలన బలు మన్ననల బడసి యథేచ్ఛంజనిరి. పిమ్మట వివిధదానములుజేసి తన సతిని విలోకించి సతీ! మనకు సర్వేశ్వరుని యనుగ్రహమువలన జక్కని కన్నియ జేకురె, ఇబ్బాలికామణిని యెక్కువ గారాబముతో పెంపుము, అనఁవుడు ధరణీదేవి నాపడుచును మిక్కిలి మక్కువతో జూచుచుండ దిన దినాభివృద్ధి నొందుచు శుక్లపక్షమునందలి బాలేందురేఖవోలె వృద్ధినొందుచుండె. ఇట్లా బాలికారత్నమును దినము మురిపెపు ముద్దుగుల్కెడు తొక్కుపల్కులతో వీనులకు విందులొసఁగుచుండ నింతలో నారాజపత్ని గర్భముధరించి యెల్లర యుల్లము పల్లవింప నైదవమాసమున సీమంత మహోత్సవమును యథావిధిగ నొనర్చెను. తర్వాత పదవమాసమున అనగా కన్యామాస శుక్లపక్ష దశమీ రోహిణీనక్షత్ర యుక్త భార్గవారంబు శుభగ్రహ శుభషడ్వర్గయుక్త లగ్నము సాయంతన సమయమున మరునిబోలు బాలునింగనెను. అంత నాభూకాంతుడు సంతుష్టితస్వాంతుడై జాతకర్మలొనర్చి నెమ్మనంబున మిక్కిలి యుప్పొంగియుండెను. ఇట్లబ్బాలుఁడు సయితము దినదినాభి వృద్ధినొందుచు తల్లిఁదండ్రి మనంబుల కానంద మిచ్చుచుండెను. అయ్యిద్దరు శిశువులును క్షీరసాగరంబున వృద్ధిఁబొందు లక్ష్మీ చంద్రులవలె నా భూపాలుని గృహంబున వన్నెలుదేరు చెన్నార బాల్యలీలా లాలనవంతులై కడుంగడు బెఱుగుచువచ్చిరి.

ఇట్లు కొన్నియేండ్లు చన నాబాలునికి యుపనయనాది సంస్కారయుక్తములయిన సమస్త విద్యలను యొజ్జలవద్ద విడిచి సంపూర్తి

గావించె. అందు ధనుర్విద్యా పాండిత్యము సకలాస్త్రశస్త్రముల యం
దును నావసుధానుండు ప్రావీణ్యుడాయెను.

అంత పద్మావతీలలామ! తన బాల్యమునందు దనచెలులతో
గూడి గుజ్జెనగూళ్ళను, కందుకక్రీడలు మొదలగునవి యాడుచు సమ
స్తావయవ సంపూర్ణమగు యౌవనమునకువచ్చెను. అప్పుడు పద్మా
వతీమతల్లి నవయౌవన లావణ్య సౌకుమార్యముతోగూడి చిలుక పలు
కులం బోలి మృదుమధురస్వరంబున తనతోడి నెచ్చెలులతో మచ్చిక
మాటలాడుచు గాలంబు గడుపుచుండెను. కొంతవడి వీణాగానంబును
నాడుచు మిక్కిలి మచ్చిక స్త్రీలంగలసి యెన్నియో వినోదములతో
క్రీడించుచుండె. ఇట్లుండ ఒకదినము పద్మావతి తనమేడనుండి గృహా
రామమందలి వృక్షములలోనుండు కోకిలశారికాకీరంబుల మృదుమధుర
ధ్వనులును పుష్పలతాయుక్త పూబోదలును చెట్లయందలి పుష్పంబు
లను దిలకించి ఆ రామమునకుబోవ నిశ్చయించి మేడదిగి తనతల్లివద్దకు
వచ్చెను. ఇట్లు తల్లింజేరి యోజనసీమతల్లి నేనిదివరకు మనపుష్పవనము
జూచి యెఱుగను. నేడు మన మేడమీదనుండి చూచితిని. నామన
మున మిక్కిలి యాహ్లాదమమరెను,కాన నాచెలులతోగూడి యుద్యాన
వనమందలి వింతలు వినోదంబులంగాంచి వలయు పుష్పముల గోసి
తెత్తు మన్ననుపుమనుడు తల్లి యిట్లను, అమ్మా! పద్మావతి నీవు నవ
యౌవన ప్రాయమున నందవనంబుజూడ బోవంజనదు, ముద్దుల
కూనా! నిన్నెవ్వరయిన గన్నచో పరిహసింతురు. నీకు పుష్పములు
కావలసియున్నచో మన పరిచారికల బనిపి తెప్పింతుననియెను. అందుల
కాకన్నెలమిన్న కినుకవొడమిన మనముతో సన్నాహారములు మాని
ముసుగు వైచికొని పరుండెను.

అంత ధరణీదేవి కూతుంజూచి ఓ నాముద్దులపట్టీ! నిన్ను
యుద్యానవనమునకు బోవలదని చెప్పినందులకా నీవింత యలుకబూని
తివి. లేలెమ్ము అన్నముదిని యారామంబునకు బోదువనెను. అంత
పద్మావతిని పన్నీట జలకమాడించి సమస్త రత్నాభరణంబుల నెల్ల
ధరింపజేసి భక్ష్యమిడి తర్వాత భూసురస్త్రీల కాపిచ్చి దాస జనులచే
పల్లకీరావించి యందు పద్మావతిని యిడి హెచ్చరికతో మరల యిల్లు
వచ్చి చేరవలయునట్లుగాజెప్పి బుత్తెంచెను. ఇట్లు మనముద్దు నెచ్చెలుల

తోడ పుష్పవనముజేరి, విహరించుచు తోడి చెలులతోఁ గూడి మల్లెలు మొదలగు పూలంజిదుముచు, కొన్ని విరిగుత్తులం జిదిమి మేలంబు నకై చెలికత్తెలపై విసరుచు క్రొవ్వాడి చూపుం జెలుల జంకించుచు పూఁబోడల తీగలపైకెగబ్రాఁకి నుయ్యాల లూఁగుచు యిట్లు వివిధ విధముల తోడి చెలులఁగూడి వనవిహారముసలిపి, యుద్యానవనమందలి కొలనులో జలక్రీడలాడి యొందఱును తీరమునకువచ్చిరి, పిమ్మట నొక యువతి పద్మావతియొక్క తడిచీరనువిచ్చి మృధువైన పట్టు పావడను గట్టెను. వేఱొకచెలి జిలుగు వలివెంపు పూలచీరను పావడపై గట్టి పైట సవరించె. మఱియొకతె రత్నస్థగితకాంచన మొలనూలుకట్టి బంధన ముగ సవరించె ఇంకొకతె బంగరుజల్తారు పట్టంచు చిందరుకావికంచుక మును గీలుకొలిపె. ఇట్లా చెలులెల్ల రొక్కొక్క యలంకరణంబు చక్కఁగా చేసిరి.

అప్పుడా సువాసిని మరు తేజిని ధిక్కరించెడి యొయ్యారంబున నివ్వటిల్లియుండియు నెల్లరు దీవించియుండ నప్పుడు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పానీయంబుల తోడ నెల్లర భుజింపఁజేసి తానును భుజించి యొక చలువతాల తిన్నెపై గూరుచుండిరి. ఇట్లు విలా సినులెల్ల కమ్మకస్తూరి నెత్తావి నీనెడు తాంబూలంబు లాచరించి వెంటనే నాయకునుగుపైననే యిష్ట కథా వినోధంబులచే గాలంబు గడుపుచుండిరి.

ఇట్లుండ, కలహభోజుడగు నారదమహర్షి యచ్చో నచ్చోటికి విచ్చేసిరి. వెంటనే చెలులతోడ పద్మావతి దిగ్గునలేచి యెల్లరా ముని నప్పునకు నమస్కారములాచరించి వారికి తగుమాత్రమైన యాసనం బిచ్చిన వారిని గూర్చుండ నియోగించి యొక విలాసి యాబుుషింగని అయ్యా! మునివర్యా! మీరీ పద్మావతిదేవి ప్రాణిని గ్రహించి భవిష్య త్తును గూర్చిన సాముద్రికము దెలుపరేయన, నాదేవముని పద్మావతి కరమునుబట్టి యామె ముఖావలోకనముఁజేసి చిరునగవుతో ఓకల్యాణీ! మిక్కిలి విలక్షణ సురేఖలు జనించియున్నవి. శ్రీమన్నారాయణుఁడే నిన్ను వివాహమాడును. నీకోర్కెలెల్ల యనతికాలములోనే యీడేరు నని జెప్పి యథేచ్ఛంజనెను. అంత పద్మావతీ చెలికత్తెలెల్లరు సంతుష్టిత స్వాంతులైరి.

పిమ్మట వేంకటాద్రియందు వల్మీకమునందున శ్రీనివాసమూర్తి ఉదయమున లేచి కార్యకరణంబుల దీర్చి యాహారపానంబులు తూర్ణముగా పూర్ణముగావించి దట్టీ మొదలగు నలంకరణంబులు ధరించి లలాటంబున తిరునామముతీర్చి నిలుచుండ దేవలోకమునుండి శీఘ్రగామియగు నొక తురంగంబువచ్చి యెదుటనిలచె అంత దానిపై శ్రీనివాసుడారోహించి యరణ్యములోని దుష్టమృగముల నెల్లదునుమాడుచు వచ్చుచుండ నొకమదావళము హరిని యెదిరించి ఘీంకృతి యొనర్చె అంత హరి దాని మదమణచ దలచినవాడై దాని దరుముకొని యనేక గిరి కాననంబులలో నెల్ల దిర్గుచ్చురి తుదకు పద్మావతీ విహారమునలువు లీలోద్యానవనమునకు వచ్చి శ్రీరమణుని దిరిగిచూచి గోవిందాయని ఘీంకృతియొనర్చె తొండముపైకెత్తి నమస్కారము జేసి రక్షింపుమని ప్రార్థింప నప్పుడా కరినివదలి చెంతనుండు పుష్పోద్యానమునకు వచ్చి కొంత విశ్రాంతినొంది యంతటలేచి నా వనావలోకనంబు జేయుచు నందలి వినోదంబులం బరికించుచు సుందరిచంద్రకాంతా శిలావేదులచే నిర్మింపబడియుండు రామణీయక లావణ్యాయుక్త ప్రదేశంబుల గని యచ్చెరువడి ఔరా యివ్వనంబింతయొప్పునే ఇందు విహరించువారు తొల్లి యెట్టి తపంబొనర్చిరిరో గదా? యని యనుచుం బోవంబోవ నచ్చోట సఖిబృందముచే నిష్టకథా శ్రవణంబుచేయుచున్న ఆకాశరాజు పుత్రి పద్మావతినిగాంచె,

ఔరా! ఇయ్యింతి సౌందర్య మేమనవచ్చును? ముల్లోకంబులనున్న యింతుల కేరికైన నీలావణ్యమమరియుండునే? ఇయ్యిందువదన ముఖావలోకనంబు జేయ నెట్టి జడుడైన కామ శరపరంపరలచే పీడితుడు గాకయుండునే? దీనింగన్నప్పటినుండి నాడెందమున మారుడు శరములనించి తొందర జేయుచున్నాడు. నేనెట్లు దీనింగని యూరకుండువాడ. ఎట్లయినను నే నీసుందరిని గ్రహించువాడను, కాన నీబాలికామణులకు గనుపడెదగాక, యని పుష్పములు గోయువానివలె నటించుచు యోరజూపుతో పద్మావతి సౌందర్యమును గనుగొనుచు పద్మావతి సఖిబృందము సమీపమునకుబోయి నిలిచెను.



## శ్రీనివాసమూర్తి పద్మావతినింగని వరించుట.

అప్పుడు పద్మావతి తనముఖమును జేయి మఱుగున జేర్చియుండ నాసఖులా హరింగాంచి ఓ శబరుడా! శుద్ధాంతస్త్రీలు వాసముచేయు నిట్టి స్థలమునకు పురుషులు రాదగునె? నీవు తెలివిమాలి యిట్లు వచ్చితివి కాఁబోలు, ఆవలబొమ్ము అన శ్రీపతి యాచెలులంగాంచి యువతీమణులారా! మీరు నన్నెందుకుతరుమువచ్చెదరు? నేను రాకన్నియతో మాటాడవచ్చితి. కనుక వచ్చినకార్యము పూర్తిగాకనె నన్నుఁబొమ్మని యెదరేల? అని హరి బలుక నంత పద్మావతి చెలులంగని సఖులారా! యితఁడు చుట్టరికముతో గలిపి మాటాడుచున్నాఁడు వీనితో మాటలాడినందున మనపుట్టి యేమిమునిఁగినది. ఇందేమికపటముగలదు? కాన మీరు వీని కులగోత్ర నామముల తెలియవలయును. శీఘ్రముగా నడిగి తెలిసికొనుఁడనుఁడు హరి నవ్వుచు యిట్లనియె.

ఓ జనజనేత్రులారా! నాకుల గోత్ర నామములను నేనివ్యేడ మీకుఁ జక్కగా నెఱింగించెద కాన నీ రాకుమారికిని నాకును సఖ్యమును గలుగజేయవలయుఁనుడీ యనెను. మీరు నాయందు సఖ్యమును జూపుడు. మీకు లగ్గొనర్చెదను.

యువతీమణులారా! నారహస్యమంతయు మీకుఁ దాచక చెప్పె దను నాగోత్రము వాసిష్ఠగోత్రము నాకులము శీతాంశకులము దేవకీ వసుదేవులే నాతలిదండ్రులు బలరామానుజుండు, సుభద్ర నా తోఁబుట్టువు. పార్థుడు నామఱందిన యనుఁడు చెలులు పక్కున నవ్విరి. హరి నిట్లు తిరస్కరించిరి. అయ్యా! నీదేహమంతనల్లగానున్న దేల? అని వారడుగ, కాంతలారా! నేను కృష్ణపక్షపు రాత్రియందు దర్ధములో జనిం చుటచేత దేహమింత నల్లనైనది. అందువల్లనే నాకు కృష్ణుఁడను నామ ము గలిగినది. ఇప్పుడు మీకు నాకులగోత్రంబుల దెల్పితిని. మీరీ రాజ పుత్రిక కులగోత్రములు నాకెఱింగించుఁడఁనుడు చెలులు.

మా రాజకుమారి వంశము చంద్రవంశము అత్రి మహర్షి గోత్రము. ఆకాశరాజు పుణ్యావశమున నీమె లభించినది.

ఈమె నామము పద్మావతి. మేమీ యువతి చెలుల మనుఁడు. శ్రీనివాసుడు సంతసించి,

కమలాక్షులారా! ఏల మాటలాడెదరు నే నీకన్యను గ్రహింప నిశ్చయించి యిటువచ్చినాడ. నాయందు మీఅనుగ్రహముంచి నా చెలికిని నాకును సఖ్యమొనకూర్చుడనియెను మరియు మీరాజనందనకు నేదగినవాడనేగాని, తగనువాడనుగాను కాన మమ్మిద్దఱఁ గల్పుఁడు. దీనితో గూడదలంచి యియ్యెడ కే నేతెంచితి. నన్నరమరసేయక నీకార్యమును జేయుండని శ్రీనివాసుడు జెప్ప పద్మావతి కోపోద్దీపితు రాలయి సఖులఁజూచి సఖులారా! యీతడు తారతమ్యము నెంచక నీతీరున నోటికివచ్చినట్లు ప్రేలుచున్నాఁడు. ఇయ్యెడనుండి వెడలి పోవు దము ననియె. అంత హరి కాంతామణీ! నేపల్కిన వాక్యముల యం దధర్మ మిసుమంతేనియు లేదుగదా? నేను బ్రహ్మచారిని. నీవు కన్య కవు. నేను బరిణయ మాడుటకు నీవు దగినదానవు. అనిన పద్మావతి ఓరీ నిషాదా! ఊరకున్నకొలది నీనోటికి వచ్చినట్లెల్ల బేలుచున్నావు. అయిన నిన్నుఁ గొట్టించుటకు నామనంబు సమ్మతింపకున్నది. నిన్ను మన్నించి వదలితి. దూరముగనుండుము. నీవు నిక్కృష్టములగు దుర్భా షలచే నాకు క్రోధాగ్నిఁ బ్రజ్వలింపఁ జేయుచుంటివి. నీకు ప్రాణ ముపై నాశవలదు కాఁబోలు. మట్టుమర్యాదలు తెలియక తుంటరి మాటలాడెదవు. ప్రాణములపై నీకాశయున్నచో వెంటనే యావ

లకుఁ బొమ్ము. అటుకాదేని నీకేగతి మూడునో చూడుమన శ్రీనివాసు డిట్లనియె.

ఓ నారీశిరోరత్నమా! ఇబ్భూతలంబున నావిర్భవించిన వారం దరును బోవలసిన వారేగదా? ఇందు సందియం బేమున్నది! నాకుఁ బోవలయునన్న విచార మిసుమంతయులేదు. నీవును నేనును గలసిన పిమ్మట బోవుదము. ఇంతలో నే నన్నుఁ బొమ్మనెదవేల? మన మిరు వురమున్ను గలసిన పిమ్మట నీవు నన్ను గొట్టినను దిట్టినను భీతిలేదు. అనఁగా పద్మావతి హరితో శబరా! నీకెన్ని పర్యాయములు చెప్పినను నీచెవిలో దూరకున్న దేల? నీ దుష్టవాక్యముల మాతండ్రి యెరింగె నేని నిన్నుఁ బ్రాణములతోఁ బోనివ్వడు. ఇయ్యెడనుండి యెయ్యెడకైన యరుగుము అనుఁడు హరి సుదతీ! నీవెన్ని చెప్పినను పరే నేనొక్కింత బీతిఁజెందను. నీకరంబు గ్రహింప నే బద్ధకంకణుఁడనైతి. నీతండ్రి నన్ను దండించునని బల్కుచున్నావు ఇది స్వప్నవార్త. అతఁడు ధర్మాధర్మ విచారదక్షుడు మిక్కిలి బుద్ధిమంతుడు. కానీ సంగతి విన్నతక్షణమే నిన్ను నాకిచ్చి సంతోసంబున వివాహమొనర్చును. నీవు నన్నెవరోయని సందియంబంద నేల. నాయందు నీచిత్తం బాయత్తపరు పుము నన్ను పరిగ్రహింపు మనుఁడు ఆయమ క్రోధావేశ పరవశాత్మ యగుచు, ఓరీ శబరుడా! చాలుజాలు! నీవృథా జల్పములఁ జాలిం పుము నీకల వాక్యములకు నే బేలుపుదానను గాను నీటక్కరి పల్కుల మాను నేను ఏడుకొండలయందు వాసముచేయు వేంకటేశ్వరుని దక్క నితరుల బెండ్లియాడనని ప్రతినబట్టి యున్నదానను. నన్నేల నాతండ్రి యితరులకిచ్చి వివాహముజేయును. ఏల యిట్లు పిచ్చివానివలె పైబడి టక్కరి మాటలాడెదవు. చీ! దురాత్మా! దూరముగ వెళ్లుము, అనుడు హరి యిట్లు చెలీ! నేబట్టినపట్టు శీఘ్రములోనే ఫలింప జేసికొనియెద. నే వదలువాడనుగాను, నాయెడ నీకు కినుకవలదని ననుసరేయని శ్రీ శ్రీనివాసుడా పద్మావతి చెంగటికి వచ్చెను. అంత సతి యాగ్రహించి గన్నుంగవ లెఱ్ఱవడ జుఱజుఱంజూచి యభిముఖంబు గాబోయి చెలులంబిలచి దుష్టుండగు యిన్నిశాచరుని ఱాలచే రువ్వుఁ డని చెప్ప నప్పుడప్పొలంతు లుప్పొంగి తెప్ప తెప్పన నూటిగ నా ఘోటకంబుపై మాటిమాటికి హరిపై కుప్పలు కుప్పలుగా శిలాపాతం

బోనర్చిరి. అప్పుడా పద్మదళాక్షుండు కార్యము తప్పినదిగాయని యు అకుచున్న నబ్బోటులువేయు జాలపోటులకు నా ఘోటకంబుదాటి పోనేరక నేలంబడియె అంత శ్రీకాంతుడు సాహాయంబు నదలి జాల దెబ్బలకు దప్పించుకొనుచు విభ్రాంతమందిన చిత్తమున దలవిరియం బోసుకొని దిశలంజూచుచు నిలువనేరక పరువెత్తుచు నుత్తరాభిముఖుడై వేంకటాద్రి కెగంబ్రాకిపోయి తనకు నివాసంబగు వల్మీకంబులో ప్రవేశించి వకుళమాలిక నిర్మితంబగు విరుల సెజ్జపై మేనుసేర్చి ప్రళయకాలమందలి మహాజలంబుల మీద వటపత్రశాయియై యున్న పరమాత్ముని చందమున శయనించియుండె.

అంత నిక్కడ వనమధ్యమున నున్న చెలులంజూచి పద్మావతి యిట్లనియె సఖులారా! జూచితిరా! నాజననిగారు వనమునకుం బోవల దని జెప్పినను, పెద్దలమాటలు వినక వచ్చినందులకా దుష్టునివలన నెన్ని నికృష్టపు మాటలు విననలసివచ్చె. అకటా నే నేమిచేయుదు? ముద్దియలారా! నీసుద్దులు నాతల్లియొద్దం జెప్పకుడు. ఇవ్విషయ మెవ్వరు విన్నను భాస్యమొనర్చుట చాలుంజాలు ఇక నెన్నటికి నిట్టి వనవిహారము సల్పను ప్రొద్దాయెను. మాతల్లికి పుష్పఫలముల గొని పోదము రండు. అని కుసుమ ఫలవల్లులంగొని వెంటనే పల్లకినారోహించి తక్షణమే యంతఃపుర ప్రవేశముజేసి తల్లిగారికాపుష్పఫలంబులు సమర్పించి వందనంబిడి తల్లిచేదీవనలంది, తల్లి యుత్తరవుచే పడక గదికినరిగి పంసతూళ్ళ పట్టెమంచముపై విరులసెజ్జను మేనుజేర్చి వగలం బొగులుచు బవళించి యుండె.

అట్లు వేంకటాచలమున శ్రీధాముడు విరులసెజ్జపై బవ్వళించి నాచెలువ సోయగ మత్యంతము మనంబునం దలపోయుచుం దనకు దానే ఇట్లు దలపోయుచుండెను. హా! పద్మావతీ! నాపై నింత యలుకబూని ఇట్లు నీ చెలులతో కూడి జాలచే కప్పితివి, ఇది నీకు భావ్యమా? అయిన మీచే జాళ్ళ దెబ్బలుతిని నా దేహమంతయు మిక్కిలి నలగజొచ్చెనే ఆహా! ఇంతులమేల్బంతీ! నాయిష్టము మీరేర్చి దెబ్బలతిని యుంటినా యదినాకు సంతసమై యుండునుగదా! కాంతా! నిన్నెంత బతిమాలినను నాయందు లేశమైన దయనుంపక పోతివిగదా!

అయ్యో! నిన్నెంత వేడుకొన్నను, కొంచమైన లాభము లేకపోయెనే. నన్నిట్లు విరహసాగరమందు ముంచుటకు నీకేమి ద్రోహము చేసితి ఇంక నేనెట్లు తాళుదు. నాయెడ నింత నిర్దయజూపుటకు నేనేమి యప చార మొనర్చితి. నే నీకు దగనివాఁడనని దలచితివా యేమి? అట్లు కాదేని యేల నా ప్రార్థన నంగీకరింపక బోయితివి. స్వాతంత్ర్యముగా నన్నుఁ పరిగ్రహించుటకు నీకుగాకబోయిన నీతండ్రి యనుమతి నైకొన వలయునని జెప్పియున్న చో కొంత సంతసమైన బొంది యుందునుగదా అట్లుచేయును జేయక కఠినహృదయవై నాపై పాషాణము రువ్విం చితివిగదా? అట్లు వివిధ విధముల విలపించుచు పద్మావతీ పద్మావతీ యనుచు సెజ్జపై మూర్ఛయందు మునిగియుండెను.

అప్పుడు వంటకత్తెయగు వకుళమాలిక సరసపదార్థ సంపన్నం బగు నన్నంబు పత్రముపై వడ్డనయొనర్చి హరిరాక కెదురుచూచు చుం డెను. ఎంత కాచియున్నను హరి రాకపోయెను. పిమ్మట వకుళమాలిక శ్రీనివాసుని సెజ్జచెంతకుజేరి, అన్నా! వేంకటరమణ లే లెమ్ము నేడు నీకేల యింతశ్రమగల్గె. పగటిలో నింత నిద్రజెందు టేల? నీవేల యిటు దీనమొందినవానివలె గన్పడుచున్నాడవు? కుమారా! లే లెమ్ము నీకు గల కోర్కె నాకెఱింగింపుము. అని చెప్పుచు వకుళమాలిక హరిని పడక లేవనెత్తెను. అప్పుడు శ్రీనివాసుఁడేమియును మాటాడక కంటి యందు నీరు గార్చుచుండెను. అంత నక్కాంత మనంబున కలకజెంది యేమిది నేనెంత బలుకరించినను మారు బలుకక కన్నుల నీరు గార్చు చున్నాఁడు. యితని యవస్థఁగాంచిన నాకెంతయో భీతియగుచున్నది. ఏమి కుమారా! విపినంబులకు నీవు వేటకుఁబోయి యున్నపుడు యేదేని భూతగ్రహములను గాంచి జ డి సి తి వా! నీమేన సోకెనా? దుష్ట మృగముల కావలమైతివా? నిజము చెప్పుము. ఏల యిట్లు మౌనముగా నున్నావు, లేక నీవెచ్చటనైన జారిపడి దెబ్బలు తగిలెనా చెప్పుము. దానికౌషధ మేదైన రాచెదను, నీవు నాయెడల దాపక చెప్పుము. వానికేదేని చికిత్స యొనర్చెదను. నీకేల సంశయము నీవిట్లూరకున్న నాకెట్లు దెలియును. అని దేహముపై మరుగుపడియున్న బట్టను లాగి చూడఁగా దేహమాద్యంతము దెబ్బలు గల్గియుండుటగాంచి అయ్యో బిడ్డా! యేల యీరీతి దెబ్బలుతగిలి వాచియున్నది. నీ కిటుఁ అపకార

మొనర్చిన వారెవరు? నీవేల మాటాడవు, నీవు మారుపల్కకున్నచో నాకెట్లు తెలియును. నీవు నాతో నున్న దున్నట్లు చెప్పుము. లెమ్ము అన్న మారగింపుము. వేంకటరమణా! నీవెందుకీరోజు నేనెన్ని విధముల గ్రుచ్చి గ్రుచ్చి యడిగినను మౌనముగా నున్నావు నీకీ మంకుతనంబెందుకు, నీచర్య నేడు వింతగా గన్పట్టుచున్నదే!

పుత్రా! నీవు వేటకరిగినప్పుడు నేదేని కన్నియనుగాంచి యట్లు దానిం దగిలిన మనంబుచే జాలిజెందితివా యేమి? నీకింత మోహము గల్గించినవారెవరు? అకటకటా నీతను వెంతయు కఠిన శిలాపాతముచే నిట్లు కంది కుందియున్నదే ఏల? నాకా యుదంతమంతయు నెఱింగింపుము నాచే నైనంతమట్టుకా కార్యము పేర్చెదను. ఔరా! నాతో కించిత్తైన దెలుపక పోయితివిగా? ఇట్లున్న యెట్లు దెలియు ననవుడు శ్రీనివాసుడు నిట్టూర్పుతో నభిముఖుండై వకుళమాలికతో అమ్మా నేనేమిచేయుదు, ఐన నీవు

గీ॥ కన్నసుతు రీతి నాయందు గరుణబూని
యిట్టు లనయంబు నన్ను మీరీక్షితంబు
దెలుపుచున్నను నేనిదే దెలుపువాడ
నాదు కోరిక దీర్పవే సాదరముగ ॥

మాతా! సకల సద్గుణోపేతా! నీ యమూల్యమగు దయకు నేవందనంబు లాచరించెద. నావంతకు గారణమరయదలచితివి గావున నిదే జెప్పెదు. నేడు నీచే ననుపబడి వేట తమకంబున కాననంబున నాకొక కరి గాన్పించె దాని మదమణచ దాని వెంటనేబోయి యొక పుష్పవనముం బొత్తెంచి యందొక లావణ్యవతిని బొడగంటిని అమ్మ గువరూపురేఖావిలాసములం జెప్పన నజునికైన శక్యంబె! నా యన్నల మిన్న సౌందర్యము గీర్తింపనరిగి.

త్రిభువనంబులం దట్టి సుందరి నెందునుగాన నేనా నారీతిలక ముంగాంచి మోహ పరవశుడనైతి ఆయొప్పులకుప్ప నాకుజేకూరెనేని యిందుండెద లేదేని యొండెడకుబోయెద, నా తలయందలి గాయము మాన్పి నన్నుం గన్నకుమారునివలె గాపాడుచున్న నిన్నెడబాయవలసి వచ్చెగదా యని వగజెందెద కాన నా యింతిని నన్ను గూర్చుకార్యము నీయది యనవుడు వకుళమాలిక.

అన్నా! శ్రీనివాసా! నీవుగన్న కన్నియ కులగోత్రములు విచారించక దాని పరిగ్రహింపఁదగునా అక్కన్నియయొక్క మాతాపితల నామంబులెవ్వి వారియునికి యెయ్యది నా కెఱింగింపుము అన, హరి అమ్మా! నాయింతి నారాయణపురవరాధీసేత తనూజాత పేరు పద్మావతీ ఆయనపేరాకాశరాజు. తల్లి ధరణీదేవి. నా యొడయుడు పుత్రకామేష్టిజేయ భూమిని దున్నింప నందొక పద్మము గనిపించె ఆపద్మమునందాయింతి లభించెను, అందువల్లనే యామెకు పద్మావతి యను నామము సార్థకంబయ్యె ఆకాంతయే నాహృదయ తాపం బొనర్చె దాని నన్నుం గూర్పకయున్నచో నేనిందుండజాల ; కానిచో వైకుంఠము జేరెదను ఇంకొకమాట నీకు జెప్పవలసియున్నది, నాచేడియను వేరుగా తలపవలదు లక్ష్మియంశజరాలు నాయువతి జన్మాంతరకృత పుణ్యపరిపాకముచేతనే లభియించును. గాన అన్యథా లభించదు అది పూర్వఫల పుణ్యపరిపాకముచేత కొంతకాలము దాని వీక్షించుట, మాటలాడుట గలిగినది. లేనిచో గాదు. అట్టి కన్యకామణిని జూచివచ్చితిని ఇక నాకాహారాదులు రుచించునే! మరి నా కన్యక నన్ను తన చెలులచేత రాలచే రువ్వించెను. నాదేహమంతయు వపశమైయున్నది. అచ్చెలువ చెట్ట బట్టకగాని నే జీవింపజాల. పద్మావతిని నన్నుగూర్చి పరిణయ మొనర్పుము మహా దాన వ్రతులుగను పుణ్యనికరంబును బొందుము అకాంతామతల్లి ముల్లోక ప్రభుడగు తమ్మిజూచి నాకై సృష్టించినవాడు అద్దాని నన్ను వివాహమొనర్చునట్లుచేయుము; సకల సుకృత నికరము నొందుము. అనవుఁడు వకుళమాలిక హరితో నాచెలువ పద్మమున పుట్టుటకు గారణంబెయ్యది యనుడు.

## హరి వకుళకు రామకథ చెప్పుట.

హరి యిట్లనియె అమ్మా! ఇందలి పరమ రహస్యము నీ కెఱిఁగించెద దాని బయల్పరచకుము. తొల్లి త్రేతాయుగమున దశరథుడను భూవరుడు దశదిశల వెలింగెడు తేజోవిరాజితుడై కోసలదేశము రాజధానియగు ముఖ్యనగరమగు అయోధ్యను పరిపాలించుచుండెను.

దశరధునకు నేను పుత్రుడనై బుట్టి కౌశికు యాగంబు నిర్వర్తించి తాటిని నాతిగ నొనర్చి శివుధనుర్భంగ మొనర్చి సీతను చేపట్టి ఆయోధ్యకుజని పితృవాక్యపరిపాలనార్థము సీతాలక్ష్మణ సమేతముగ విపిములకుఁజని చరించుచున్నతరినొక బంగరు లేడినిగాంచి సీత భ్రమించి దాని దేగోరగా నేను విల్లును విశిఖంబులుబూని యేగితిని అంత దశవధనుఁడు శీతను తనరథముపై బెట్టుకొని లంకకు బోవుచుండ సీత సమస్తదేవతలను మిక్కిలి రోదనజేయుచు దూరుచుండెను. అగ్ని దేవుడు రావణుని యెదుర్కొని ఓరావణా! నీపై కొంతస్నేహముగల్గి యున్నందున నీకొక రహస్యముపదేశించెద, ఇప్పుడు నీచే గొంపోవబడు కన్య సీతగాదు నిజమైనసీతను నావద్దనుంచి వేదవతిని సీతనుగా జేసి యిక్కడ రాముడు వుంచిపోయినాఁడని పితిహోత్రుఁ డనియెను. అప్పుడు రావణుని వద్దనున్న నిజసీతను మాయసీతయని యగ్నికిచ్చి యగ్నివద్దనున్న మాయసీతనుగొని లంకకేగి యశోక వనిలోనుంచి పెక్కు-శ్రీమల బెట్టుచుండెను. అగ్ని నిజసీతను తనపత్నియొద్ద యొప్పగించి జాగ్రత్తగా కాపాడుచుండెను. పిమ్మట రాముడు కపి మూఁకల తోడ లంక ముట్టిడించి, రావణ కుంభకర్ణులు మున్నగు దుష్ట నిశాచరుల బీమడచి సీతనుగొని ఆయోధ్యజేరి శీతయందు సందియమంది యగ్నిప్రవేశము జేయుమన నప్పుడు నిజసీతయును మాయసీతయును యిద్దరు బొడమిరి. అప్పుడు రాముఁడు నిజసీతను జూచి కాంతా యీామె యెవ్వరు? అనుడు శీత రాముని కగ్నిదేవుని ప్రభావమును దెలిపి యీామె నిన్ను వివాహమాడఁదలచి యున్నదనగా రామభద్రుడు నేను కలియుగమున దుష్టశిక్షణము శిష్టపరిపాలనఁ జేయ వేంకటాచలమున నవతరించెద, నప్పుఁడీమెను చెట్ట బట్టెదనని నుడివితి. అవ్వేదవతియే పద్మావతి, ఈసంగతి పరమరహస్యము. ఇంకనీవు సంశయింపక నారాయణ పురవరంబునకేగి వివాహప్రయత్న మొనర్పుము

అనుడు వకుళమాలిక సంతుష్టాంతరంగయై శ్రీహరింగని ఓ పురాణపురుషా! నీవు రమాకాంతుడవైన శ్రీ మన్నారాయణుడుగాని సామాన్యుడవుగావు. నిమాయుంగడవ బ్రహ్మాదాదులకు తరముకాదు. నేనిట్లు దెలియుదు.

నిన్నుఁ గన్నపుత్రుఁడని ప్రియంబున పోషించుచుంటి. నీమహి

మంబు నేదెలియనైతి. నేడు నీగుట్టు యెల్లను దెలియనయ్యెనుఁ వారి జాక్షా! నిన్నుకుమారుడనియును నీ మాయను దగిలి నీస్వరూపము దెలియక నింతకాలంబరిగె. నీవు బ్రహ్మవు. నీవరుద్రుడవు, ఇంద్రుఁడ వీవ రాముడీఁవ, నీవ కృష్ణుఁడవు, నీవ కోండ్రస్వామివి, నీవ మహా విష్ణువు అజ్ఞానంబున దగిలియున్న నామదికి నీవు గోచరుఁడవు గాక పోయితివి అని చింతిలుచున్న వకుళనుగాంచి హరి యిట్లనియె. అమ్మా! నాతలయందలి గాయమును మాన్పిన నీ ఋణమెట్లు దీర్తు నని యాలోచించెదను నీవు జాగుచేయక నారాయణవనమునకు నేగి పద్మావతి గళమున మంగళసూత్రమును నాచే గట్టు నట్లొనర్పుము. అనుఁడు వకుళమాలిక హరితో నిట్లను, నేను ఆకాశరాజునకు నీసం గతి నేమని చెప్పుదు. నీకులగోత్రంబులు చెప్పవలయుగదా. అందుల కేది నుడువుదు, అనగా హరి అమ్మా!

భూతలంబున మహాప్రఖ్యాతి వహించియున్న చంద్రవంశపు వాఁడనియును, దేవకీవసుదేవుల తనయుడనును జన్మతార శ్రవణ మనియును, సకలలోకములందును వసించువాఁడనియును, బలరాముడు సోదరుడనియును, సుభద్ర చెల్లెలనియును, భక్తజన రక్షకుడఁని యును, దివ్యమంగళ విగ్రహుండనియును. నీసుతుకు దగిన వరుడఁని యును, సమాధాన మొసగుము అన,

అక్కాంత పవనజవ తిరస్కృతమగు హయంబునెక్కి నతి శీఘ్ర ముగా శైలావరోహణ మొనర్చి కపిలేశ్వరుని పూజించి, హరికి శీఘ్ర ముగ వివాహమగునటుల ప్రార్థించి యచ్చోవదలి శుకాశ్రమముజేరి వారికి నమస్కరించి వారి యమోఘాశీర్వచనములబొందియచ్చటనుండి యగస్త్యాశ్రమముచేరి వందనంబు లాచరించి వారియాజ్ఞచే యగస్త్యేశ్వరు నాలయంబు బ్రవేశించి శివునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యందున్న స్త్రీజనులజూచి యందు నొక కన్యను బిలిచి మిక్కిలి మక్కువతో సంభాషించు దానివలె నటించుచు యిట్లనియె,

కం॥ ప్రియసఖి యెవ్వరిదానవు।
దయదొలుగక జెప్పవమ్మ దాపకయనుఁడు।
నయమున విచార మొందుచు।
దయనేర్పడ పల్కెనపుఁడు దాపకయుండక॥

దయనేర్పడ పల్కెనపుడు దాపకయుండక ॥

సీ॥ ఆటాడుచుండ నంతలో నటునొక్క
శబరుండు వచ్చె నాశ్చర్యముగను ।
వాఁడెట్టివాఁడన్న వనదాభ వర్ణుండు
లలిత సద్భూషణాలంకృతుండు ।
నాజానుబాహుండు నబ్జాతనేత్రుండు
సర్వేందువదనుండు భాసురుండు ।
గంభీరవక్షుండు ఘనకంబు కంఠుండు
మహనీయమన్మథ మన్మథుండు ।

గీ॥ ఘనతరంబైన వరఘోటకంబుమీఁద
నెక్కి సరస సల్లాపధీరుఁడై హీనశౌర్య
కలితుఁడైవచ్చి మారాజు కన్యచెంత
జేరి యేమేమో మాటల జెప్పుచుండె ।

అమ్మా! యిట్లా శబరుండు మా రాకన్నియ చెంతజేరి యేమేమో ప్రేలుచుండ మారాజపుత్రి మేమును తోలరువ్వితిమి. దానికి తాళుకోలేక నుత్తరాభిముఖుడై పోయెను, పిమ్మట మేమెల్లరము రాకన్నియను నగరుజేర్చితిమి. అదిమొదలా కిరాతుని దృష్టిచే తాప జ్వర మొదవినది. అంత వసుందరాకాంతుడు మంతనంబున వంతజెంది సురాచార్యురావించి యాలోచింప నాతండు రాజా నీకుమరితకు భయములేదు. శాతింపుము రుద్రాభిషేకముచేయింప శాంతించునని జెప్ప రాజు కొందఱు విప్రుల నియమించి రుద్రాభిషేకము జేసిరండనియనుప మే మరుదెంచితిమి అనిమెను. వకుళమాలికనుచూచి నీ నెలవెయ్యది? నీపేరేమి ? ఎందులకై యిం దేతెంచితివి? అనుఁడు వకుళ యామెతో అమ్మా! మాది వేంకటాచలము, నేను వేంకటేశుని దాసిని ఆ పరాత్పరుని యాజ్ఞను మీరాజదంపతులతో మాటాడవచ్చితిని అనఁగానే అమ్మా! నీవిచ్చటనే యుండుము రుద్రాభిషేకమైన వెంటనే మా రాజాంతఃపురమునకు తీసుకపోయెదము అని యాకన్నిల మిన్నియనెను. అంత వకుళ యొకచోట గూర్చుండెను.

# హరి యెరుకల వేషము బూనుట.

పదంపడి శ్రీనివాసమూర్తి వకుళను నారాయణపుర సరమునకు బంపినను తన మనసు స్థిరమునొందక తనలో మనము పంపిన మనిషి యాడుది. ఆమెవలన కార్యమగునో కాదో? ఈమె స్థిరముగా మాటాడునో లేదో యేమిచేయిదు నామనసు తపించుచున్నది. నే నేమి చేసినను యిదేయేతరి ఆవల కార్య భావమయిన నెట్లు? తొట్టతొలుపనే దీని సాధించెదగాక యని కొంతవడి వంతనొంది మంతనంబున చింత వదలి ఎరుకలసాని రూపము ధరించి మాసిన తలయును, చీరెయును, చీలిక పేలికలు బోనివలువలును ,కంచు కడియంబులను, దంతపుకమ్మలును. గురిగింజ పెసలును మొదలగువాని నలంకరించుకొని మెరుగులీనెడు బెత్తము చేతబట్ట, నవధాన్యములుగల బుట్ట మౌళిధరించి పితామహుని యేడునెలల బిడ్డగ నొనర్చి వీపునగట్టి నారాయణపురము ప్రవేశించి వీధివీధిని, ఇంట యింటనుగల స్త్రీలగాంచి యెఱుకో యెఱుకో యంచునరచుచుబోగా నాపుర స్త్రీలెల్లరు నాసోదకత్తెను బిలచి సోదెలడుగుచుండిరి. అంత రాజకన్నియు లరుదెంచి యీసంగతి రాజపత్నికి దెల్పిరి

ధరణీదేవి రాజకన్నెలచే నాయెఱుకతెను రాజాంతఃపురమునకు రప్పించి దానికి యన్న పానములున్ను, తాంబూలమున్నుగునవి యిచ్చి సంతుష్టి నొందించి పిమ్మట ధరణీదేవి యాకురువంజనగాంచి అమ్మా! నీవెవ్వరు? నీదేశము? మీకాపురమెచట? అనుడు సోదెకత్తె

సీ॥ ఎరుకవారల కెల్ల గురిగట్టగా నిల్వ।
నొక్కచోటున్నది నీక్కముగను।
నడిమెక్కడన్న నావూరుబదియు బం।
డ్రెడు బదునారును రెండున్నైన।
శృంగపంక్తులచేత నింగి కెరుగుచునుండు
నారుకోడలమీదను నేడుకొండ।
వేయిశృంగములలొప్పు వీక్షింపదగు కొండ
మూడెల్లతో గూడి మొనయుకొండ।

॥గీ నాల్గుతోవ్రలకును నట్టనడిమికొండ ।
పాముతనలోన నుండగ ప్రబలుకొండ ।
మేలి కరుల దనరారి మెఱయుకొండ ।
తొంటి మాపెద్దలున్నట్టి దొడ్డకొండ ॥

క॥ ఆకొండమీఁద నిక్కము మాకాపురమెపెడు ।
చలఁగ మరి జీవికకై లోకుల ।
కెఱుకలఁజెప్పుచు బోఁకువ బ్రతుకుదుము ।
నీవు సోదెలడుగుమీ ॥

అమ్మా! మాకొకచోట నివాసంబని చెప్పుటయెట్లు? మేమెల్ల చోటుల నివశించియుందుము నాపేరెట్లుదెలుపుదు! తెలిపినను దెలిసికొనుట కడుదుస్తరము. సాధుజనులెరుగుదురు. వారివారికి యెఱుక జెప్పుచు వూరువూరు వల్లెపల్లె దిగుచు యిటువచ్చినారము. ఇప్పుడు ధగధగ మెరయు బంగరుకొండపై కాపురమున్నాము. మానవుని కోరికల దెల్పి కానుకలబొంది జీవించుచుండెడివారము అనుటయును, రాజపత్ని సోదెకు కానుకలేమి యివ్వవలయుననుడు ఎరుకత అమ్మా! ముంతెడు ముత్యముల దెప్పింపుము ఆలశింపకుము. అనుచుండ రాజపత్ని యప్పుడు బంగరు మెరిటిచే మౌక్తికఁబుల దెచ్చియుండని చెలికత్తెల కాజ్ఞయొసంగె. అంతట వారు ముత్యములనుదెచ్చి ముందునుంచిరి. దానిమూడురాసులుగాచేసి మధ్యభాగమునందున్న రాశిపై దృష్టినిలిపి ధ్యానించుచుండెను. కర్పూర ధూపదీప నివేదన యొనర్చి హారి యిట్లనియె.

క॥ దిక్కుల చూడక సతినా ।
దిక్కేయిటుజూడు ముప్పుఁడు దేవరతోడః ।
నిక్కము నీకు వచించెద ।
మక్కువతో నాలకింపు మానినినీవుః ।



అమ్మా! నీతలంపులోని కోర్కె జెప్పెద నీవు నీకూఁతు విషయమై చింతిల్లుచున్నావు. అది యెయ్యదియనఁ నీకూతురు యొకనాఁడు వనమునకు బోయియుండ నొక శామలాకారుని జూచినది. వాని గన్నది మొదలామగువ మిక్కిలి తాపముచే తపించుచున్నది. ఆ పురుషుడు శ్రీమన్నారాయణుడు, ఆదిపురుషుఁడు, ఆ ది మ ధ్యాం త రహితుడు అతడు ఖగకులేశ్వర వాహనుడు. అట్టివానిని పెండ్లియాడ వలెనని యున్నదమ్మా కాన నీసుతను వానికిచ్చి వివాహమొనర్పుము, అట్లుచేసిన సుఖముగల్గును. లేనియెడల కష్టము గల్గును. అనెను, రాజపత్ని నవ్వి యెరుకలసానీ! నీకోవె వింతగా నున్నది. నక్కయెక్కడ, నాగలోకమెక్కడ,? నారాయణుఁడెక్కడ, నరసుతయైన నాకూఁతురెక్కడ? నీమాటలెల్ల టక్కరియనగానే—

అమ్మా! నామాటలు టక్కరిగావు. అశోఁడొక కిరిని తరుము కొని మీావనాంతరము ప్రవేశించి నీసుతను కనుగొనెను. నీకూఁతు తోడ తన యభిప్రాయమును గనుపరుచుచు చాలవరకు ముచ్చటించెను పిమ్మట నీకొమరిత కినుకుతో రాలను విసరుచు చెలులతోఁ గూడి బెట్టిదముగ కొట్టుచుండగనే నాతఁడా దెబ్బలకు తాళజాలక వృత్తరాభిముఖుడై యేగెను. అంత చెలులతో నంతఃపురము ప్రవేశించి యతని యందలి మోహమున మంతనంబున వంతనొందుచు మరుతాప జ్వర

ముచే కృశించుచున్నయది. ఇదియే సంగతి నామాటనమ్ము అతని కిచ్చి పెండ్లియొనర్పుము, లేని యెడల కష్టముగల్గును .నాసోదె యెన్న టికిని పోలుగాదు. శేషోమాహో వేంకటేశునిదాసి కన్యానిమిత్తమై మీ చెంగటికి రాగలదు. అప్పుడు నామాట నిజపడగలదు, తర్వాత నాకు బహుమతి యిప్పింపుము, నేను పెండ్లికి వచ్చెదనని చెప్పి నచ్చోటు బాసి స్వస్వరూపంబుతో వేంకటాద్రియందు ప్రవేశించి తింత్రిణీ తమ ప్రదేశమునందున్న వల్మీకమునందుఁజేరి చాలచింత నొందుచుండెను.

తర్వాత ధరణీదేవి తన తనయ యిట్లు పరుండి యుండుట గని అమా! పద్మావతీ! యొప్పుల కుప్పా! నీవేల యీాకృతి ముసుగిడి పరుండి యున్నావు? తల్లీ నేను వనమునకు వలదంటినే? నా మాట కాదని యారామమునకు బోయితివే అచట నెవ్వరైన నీకు గోచరిం చిరా? వానింజూచి యేమయిన భీతినొందితివా? లేక ఇక నేమయిన నీమనస్సున నున్న వృత్తాంతమంతయు నెఱుంగబల్కుము దానికిదగు చికిత్స యొనర్చెద కన్నతల్లినైన నాతో మాటాడక నీవు మిన్నక యున్న నిన్ను గన్న నేనెట్లు యోర్తునమ్మా! తల్లితోడ జెప్పని మర్మ మొండు గలదా? జెప్పుము! తల్లీ! యన పద్మావతి కొంత తడవునకు తల్లింగాంచి___

అమ్మా నేనానాడు వనంబునకు మీవద్ద సెలవుగొని పోయి యుంటి అప్పుడొక మహాపురుషుడు తురగారూఢుడై వచ్చి నాతో ననేక విధముల మాటాడజొచ్చెను. అప్పుడు చెలులు క్రోధావేశ ముతో నాతనిపై శిలావర్షమును వర్షింప నాగుఱ్ఱము పుడమింబడెను. ఆ దెబ్బలకు తాళకతడు పరువెత్తెను. అదిమొదలు నాకేనిపై మనము దగిలి యిట్లు దురంతర వేదనచే దురపించుచున్నదాన. నాదివ్యమంగళ విగ్రహుని మరల గనుసందాక నాకు మనము దక్కదు తనువు మనము యూరటజెందదు నాయవిధేయతచే యిట్లు కావించుకొంటిని నే నేమిచేయుదు ననుచు మరల మూర్ఛావస్థచే తల్పముపై వ్రాలెను

ఇట్లు మూర్ఛచే నేలవ్రాలిన కూతును రాజపత్ని లేవనెత్తి చిత్తంబున యుత్తలం పలిమికొనినదై అమ్మా! తనయా! యిట్లు త్రోవనుజను వారిమీాద మోహముచే వివశులగుదురా? దీనివిన్న లో

కులు కాకులవలె పలువిధముల జెప్పుకోసాగరా? ఇది నగుబాటుగాదా? అని ప్రలాపించుచున్న తల్లింగని పద్మావతి అమ్మా! నాకొరకై మీకప కీర్తియెందులకు? నాడునాకంటబడిన పుండరీకాయతాక్షుడు, నా దీర్ఘబాహుడు, నాసీనవక్షుడు. ఆకర్ణాయత నేత్రుడు. నా మనోహరుడు. నాపయోవశ్యాముడు నాకెదురగు చుండగ నేసేవించక చెలులచేత రాళ్ళను రువ్వించితినే వారికెట్టిబాధ గల్గించితినో. యని చింతిలుచున్నదాన గాని యెంతమగాదు. అప్పద్మాక్షుడు నేనోర్చిన యపరాదమును సైచి రక్షించునో. రక్షింపడోయను సంశయము నన్ను భాధయొనర్చుచున్నది. కాని మోహవికారముకాదు అనుడు ధరణీదేవి చింతాకుల మానసయై కూతు నోదార్చి సీకీ చిన్నతనము నందే భగవంతుని మీదిట్టి గాఢమైనభక్తి కుదురుట నచ్చెరువుగా నున్నది. ఇంతకుమున్నొకదేవత నాకుబ్రసన్నయై నాకు నిదేవిషయ మును ముచ్చటించెను. ఇదియెల్లరు నీక్కము ఇది చక్కఁగా ఫలించుగాక యని సంతసంబున నుప్పంత దుదాభిషేకమును గావించి పుష్పఫలంబులు గైకొని మరలి వచ్చినపుఁడు శ్రీవెంకటేశరిరుని పను పున జనుదెంచియున్న వకుళమాల వారలంగలసి వారితో సంతసంబున ముచ్చటించుచు రాజనగరుజేరిరి.

అనంతరము తాముదెచ్చిన తీర్థమును పాన్పుపైనున్న పద్మావతిపై ప్రోక్షించిరి. పుష్పఫలమును సమర్పించిరి. ఆశీర్వదించిరి,

పిమ్మట ధరణీదేవికి వకుళమాల వృత్తాంతమును తెలిపిచూపిరి. అంత నారాజకాంత శ్రీకాంతుని దాసియని వివిధ విధుల నామెను గౌరవించి నొక భద్రపీఠముపై గూర్చుండనియోగించి యిట్లనియె

అమ్మా మీరెందుండి యిందువచ్చితిరి! మీరువచ్చిన ప్రయోజనంబేమి అనుఁడు వకుళమాల ధరణీదేవితో అమ్మా! నేను వేంకటేశ్వరుని దాసిని. శ్రీవారి యాజ్ఞచే మీ సుతునడుగ నిందువచ్చితి. ననవుఁడు రాజకాంత మిక్కిలి సంతసించి చిరునవ్వు నివ్వటిల్ల వకుళం గాంచి అమ్మా! శ్రీపతి నాసుతు నెప్పుడుగాంచె. లోకనాథుడు నాబిడ్డను చేపట్టునా! ఇదియంతయుఁజూడ మిక్కిలి విస్మయముగ నున్నదే అదియెట్లు నాకుదెల్పు మనవుడు వకుళమాలిక శ్రీనివాసుడు వేటకు వచ్చుటయు, వనంబున గజంబునుగాంచి తరుముకొని వుపవనము

ప్రవేశించి రాజకన్యతో మాటాడి వారు తాళ్ళవర్షము వర్షింపగా తాకుడుకు తాళజాలక వెళ్లుటయు మున్నగు విషయములను దెల్పెను. శ్రీనివాసుడు నీకన్నియ కరగ్రహణ మొనర్ప మిక్కిలి మోహపరవశాత్ముడై యున్నాడు, ఈవృత్తాంతమంతయు నాకెఱింగింపుచు నన్నిచ్చోటికి బుత్తెంచె. తాను శెయ్యాతల్పమున పడక పాసగనివాడై యున్నాడు. కాబట్టి నీకొమార్తెను నా హరికొసంగ వేడుచున్నదాన, అనఁగానే రాజకాంత సంతసించి వకుళతో శ్రీహరియొక్క కులమెయ్యది? గోత్రమెద్ది అనుఁడు వకుళ హరి కులము చంద్రవంశము వాశిష్ట గోత్రము అనిన, తల్లి తండ్రులెవ్వరు? దేవకీ వసుదేవులు అని ప్రత్యుత్తరంబియ్య వారందరు గడు సంతసిల్లిరి. పిమ్మట వారిచెంత ప్రకృతములోనుండు లక్ష్మీవృత్తాంతం బడుగ ప్రజల పాలింప కొల్లాపురమున కరిగియున్నది, ఆకారణమున మీ కుమరితంగని మోహితుడై యున్నాడు. అందుచే నన్ను మీచెంత కనిపెను. మీ భాగ్య మేమన వచ్చు అమ్మహామహుని వర్ణింప నెవరితరము ఇంక మీరు జాగుసేయకుఁడు శీఘ్రంబ భవత్పతి కెఱిగించి, ప్రత్యుత్తరంబు గైకొని రమ్మనుఁడు యన ధరణీదేవి భర్తకెఱింగించె. రాజు కావార్త తెలుపగానే మిక్కిలి సంతసించిరి. అప్పుడే వకుళమాల చెంతజేరి, యమ్ముతకు ముదం బొపాదించెడి పల్కులనుబల్కె అప్పుడు వకుళ ధరిత్రి వల్లభుని తో రాజా! మీపత్నిగారివల్ల యావద్వృత్తాంతము వింటిరిగదా? ఇందునకై మీరెంతయు సందియపడ నవసరములేదు. సుభస్య శీఘ్రం అన్నారు ఆలశించకుడు, అని యడుగుచుండగనే లోపలి సౌధంబు ప్రవేశించి శయ్యపైనున్న కూతుంగని అమ్మా! తనయా నీవేల తపించెదవు. నీకుఁ దగిన వరుడు లభియించు నీమంతనంబునం గల చింత మాని మజ్జనంబొనర్చు అన్నపానంబు లారగింపు మనుచు గ్రిష్పతిని రావించి స్వబంధుల యెదుట వధూవరుల పొంతనంబులపరిశీలించి:—

వైశాఖ శుద్ధ దశమి శుక్రవారంబునాటి రాత్రిముహూర్తమును నిర్ణయించి పత్రికను తయారుచేయించి యాపత్రికను యందరి రాజుల యెదుట చదివి వినిపించి దానిని శుకమహర్షి చేతికిచ్చి దీని నీవు గొని పోయి శ్రీరమణునికిచ్చి బదులు పత్రికను బొంది రావలయు సుమా! యనుఁడు శుకాచార్యుఁడట్లే యొనర్చెను.

పిమ్మట వకుళమాల ఆకాశరాజవర్యునిచే సమర్పింపబడిన దివ్యాభరణాంబరములు మున్నగునవి యలంకరించి వెంటనే వేంకటాచలమును జేరి శ్రీపత్రికా యుదంతమును జక్కఁగాదెల్పి నీవిఁక పెండ్లికిఁగాదగు సామగ్రులు సేకరించు కొమ్మనుడు శ్రీనివాసుఁడు అమ్మా! వకుళమాలికా యిప్పుడు నాచేత పైకములేదు. సిరి యెప్పుడు నన్నుఁ బాసెనో యప్పుడు నావద్దపైకము లేదాయె. నేనెట్లు కార్యము నిర్వహింతును. ఇకార్యమునకై రాదగు దేవతల నందర నెట్లు బహూకరింతు అయిన నీవిప్పుడు వరాహస్వామి నడిగి కార్యమునకుఁ గావలసిన పైకము దెచ్చియియ్యుమ్మ అనవుఁడు వకుళ వరాహస్వామి చెంతకరిగి యేతద్వృత్తాంత మెఱింగించి పైకమడిగెను, అంతయువిన్న క్రోడస్వామి వకుళతో అతఁడెవరని దలచితివి వారు దలచిన పని యెన్నటికైనా విఘ్నమగునా? నీవు యూరక చూచుచుండుము అనెను. ఈ వృత్తాంతమును వకుళ వారికి దెల్పెను. వారి పరివారమును గని వారిచేత శోభన ముహూర్త పత్రికలనిచ్చి సమస్త దేవతల కనిపె, అంత సమస్తాది నాధినేతలు తమ కాంతల సహితముగా వివాహమునకు ముందే వచ్చి చేరిరి.

అప్పుడు దేవతల గని హరి సురులారా! నేనీ కలియుగమున నారాయణపురవరాధి నేతయగు యాకాశరాజు కుమారి పద్మావతిని వివాహమాడ దలచియుండుట మీకెల్లరకును సమ్మతమేనా యనుడు అందులకు వారెల్లరు వల్లెయనిరి.

అంత ప్రయాణ లగ్నంబాసన్నంబగుఁడు వారెల్లరు ప్రయాణభేరి వాయించిరి హరిని బిలువ హరి సిరిపై దగిలిన మనముతో యుండుట గని యెల్లరు యిదేమిదేవా? మీరిట్లు చింతాక్రాంతులై యుండుటకు హేతువేమి? అను మాటలకు శ్రీపతి శ్రీని యెడబాసిన వాడను. నేనెట్లు రమనువదలి వేరు వివాహమాడుదు లక్ష్మీ నాపొంత నున్నచో నాకన్నియు నున్నట్లై, కాన నాకీ వివాహమువలదు, లక్ష్మీలేని వివాహము నే నొల్లననెను,

పిమ్మట దేవతలందరు యోచించి సప్తసైంధవుని రావించి వానిని లక్ష్మీబుత్తేర యనిపిరి వాడట్లే కొల్లాపురము జేరి యావృత్తాంత మెఱింగించకనే హరికి మిక్కిలి జబ్బుగానున్నది. కాన మిమ్ములజూడ

నపేక్షించుచున్నాడు. మీరు శీఘ్రముగనే రండు అంత రమాసతి చాల వంతనొంది హేమ విమానముపై వెడలి శేషాద్రిని ప్రవేశించె. ఇట్లు ప్రవేశించిన లక్ష్మిని పార్వతి మొదలగు యాదేవాంగనలు యెదురొంని నమస్కృతు లొనర్చి పిలుచుకొనిపోయి వారి సాన్నిధ్యమును నిలిపిరి.

అంత శ్రీనివాసుడు మిక్కిలి మక్కువతో రమను బంగరు బీఠికపై గూరుచుండబెట్టి యెవరికిని దెలియని రహస్యభవనంబున లక్ష్మితో కొంతవరకు ముచ్చటించెను. తర్వాత తాను లక్ష్మినెడబాయుటాదిజేసి ప్రస్తుతమున ఆకాశరాజపుత్రి పద్మావతిని వివాహమాడదలచుకొని యున్నవరకు విన్నవించెను.

కాంతా నీవునన్నొంటిగా విడచి వెళ్ళినది మొదలుకొని నేబడిన కష్టములు నేనెల్లుచెల్పుదు. నేను వైకుంఠమును వదలి వచ్చినదాదిగా కడకండ్లను నెల్ల తల్లివలెనె నన్నుగాపాడిన ఈమెను యెట్లు గౌరవించుటకు నాకు తోచకయున్నది, కన్నతల్లివలె గాపాడిన ఈవకుళాదేవి ఇహపర సౌఖ్యంబులు బడయుగాక. ఓ ప్రేయసీ! నీయాశీర్వచన ప్రభావముచే బ్రతికితినిగాని యొండుగాదు. ఇపుడొక సమాచారము నీకెఱింగింప యిచ్చగించి యున్నాడను. అది యెద్దియన ఇచ్చటికి సమీపమున నారాయణ పురవరం బొండుగలదు. ఆపురాధిపతియగు ఆకాశరాజుకూతు పద్మావతిని పరిణయంబొంద నపేక్షించి యున్నాండను. పద్మావతి యొకదినంబున వనవిహారము సల్పుచున్న నేనచ్చటికి బోయియుంటి. అప్పుడాయుగ్మలి నాకనేక బాసలిచ్చి మోహించి యున్నది. నేనద్దానిని వివాహమాడెద, నీకిది ఇష్టమయ్యోనేని చెట్టబట్టెద. లేనియెడ మిన్నకుండెద నన లక్ష్మి హరికి హస్తయుగ్మము ముకుళించి యిట్లనియె.

నాథా! నిన్నెడబాసి యింతవరకు చింతిలుచుంటి, తామిప్పుడు తలచిన కార్యమునకు వేరేల గలుగును? కాన తమ ఇష్టమువచ్చిన చొప్పున నాయిందుముఖిని చేబట్టి చల్లగనుండుడు. అని పలుమార్గములు నిష్ఠురములాడుచు స్వామీ! నేను మీకార్యమునకు విఘ్నము గలిగింపనను సందియముతో మీరిట్టిమిషచే నన్ను రావించితిరి,

అయినను నష్టములేదు. ఇందుచేనైన తమ దర్శనమయ్యెను. నే ధన్యురాలనైతిని. అని బ్రహ్మాది దేవతలనుగాంచి యిట్లనియెను.

కమలాసనా! ఇకా లస్యంబువలదు, శ్రీనివాసుని స్నానార్థమై ప్రార్థించుచున్నానని తెలిపి సుర యక్ష గంధర్వులఁ బిలచి వారలచే బంగారు కలశముతో పుణ్యతీర్థముల దెప్పించి సమస్త మాయత్త పరచి హరిని స్నానమునకుఁ బిలున మిక్కిలి వ్యసనాక్రాంతుఁడైన వద నముతో నుండు లక్ష్మి మిక్కిలి వ్యాకులతచేరస్కరమై కన్నులంగమ్మ జలబిందువులు పుడమిపైరాల మోము పైకెత్తియున్న నాహరి దేవత లనుగని వేల్పులారా! నేను వివాహమాడుట మీజనని కిష్టములేదు. కాన నాకెందుకు వివాహము? నేను వెండ్లాడి యీమెకేల చింతగలి గించవలయు? ననుచుండ బ్రహ్మాదులు మిక్కిలి భయాకులిత మానసు లయి హరింగని సర్వేశ్వరా! మీరిటు పలువిధుల బల్కుచు చింత నొంది యుండుట భావ్యమా? తాముదలచిన కార్యమునకు ప్రతిగల దా? అని పలువిధుల ప్రస్తుతించుచుండ, లక్ష్మీదేవి దిగ్గునలేచి హరిని బోఁడగని స్వామీ! నన్నేల ఇట్లు నిందబొందించుచున్నారు. నన్ను లోకము నిందించుటకై మీరీ శోక మవలంభించితిరి కాఁబోలు. లేసి యెడ యిట్లు, చేయుదురాయని పల్కుచు తనకేలుఁ దామరచే హరిని లేపగా మిగుల సంతసముతో లేచి వసిష్టాది ఋషివర్యులకు నమస్క రించి పెండ్లిపీఠముపైగూర్చుండ ముత్తైదువులు బంగరు పళ్లెరములతో హారతులెత్తిరి. పాటలుపాడిరి. అప్పుడు దేవతలు దీవించిరి. సంపెంగ తైలముచే తలయంటి పరిమళ ద్రవ్యయుక్త నలుగుపిండిచే నలుగిడిరి. పిమ్మట పార్వతి మొదలగు స్త్రీలు శుద్ధోదకములచే జలకమాడించిరి. తర్వాత శ్రీనివాసునికి యిందిరాదేవి పుందరంబగు సువర్ణ చేలంబులం దెచ్చియిచ్చె, హరి వాని నలంకరించుకొని సభా మంటపమునకు విచ్చేసి ధర్మ నిర్మిత రత్నాలంకృతమగు సింహాసనముపై నధివసించి బ్రహ్మనుగాంచి మీతల్లికి మంగళస్నాన మాచరింపుడన నావార్త లక్ష్మివినియు మిన్నకయున్న లక్ష్మింగని విష్ణువు కాంతా నీవు స్నాన మాచరింపక నేను వివాహమొల్లనన తలవాంచియున్న లక్ష్మీదేవి వికలమైన మనసును స్థిరపరచుకొని స్నానమునకు కంగీకరింప యప్పుడు కొందరు సఖులు సత్వరముగా సంపెంగతైలముచే తలయంటి జల

మార్చిరి. వెంటనే రత్నఖచిత దివ్యాభరణాంబరములచే యలంకార మొనర్చిరి. వెంటనే సాన్నిధ్యమునకుచేర్చి పెండ్లిపీఠపై నాసీనుఁ జేసిన, అంత కుబేరుడు దివ్యాంబరాభరణంబు లొసంగె మంగళ ద్రవ్యములు, కుసుమ మాలికలు వకుళమాల కొనివచ్చి హరి సన్నిధి నునిచెను.

అంత లక్ష్మీనారాయణులు, బ్రహ్మేంద్రాదులు, సనకసనందన సనత్కుమారాది యోగీశ్వరులెల్లరు వసిష్టాది మునులు జయ జయ శబ్దములచే నమస్కరింప వెంటనే వసిష్టులు ముత్యములచే వివాహ వేది కను హోమగుండము నిర్మింప లక్ష్మీయుక్తముగా స్వామిని గూర్చుండ నియోగించి వైఖానస శాస్త్రోక్తముగా పుణ్యాహ వాచనాది కృత్యములు నిర్వర్తించి సభాతాంబూల మర్పించి హరితో వసిష్టుడు పసుపు గంధాక్షతలతో మంగళ ద్రవ్యంబుల నొక పళ్లెరంబున నించు కొని తన కులదేవతయగు శమీవృక్షంబు చెంతకుజని పూజానమస్కృ తు లొనర్చి ప్రదక్షిణ మొనర్చి నిర్విఘ్నముగ వివాహము జరుగునట్లు ప్రార్థించి మరల శేషాద్రికింజని వరాహస్వామిని వివాహమునకు జను దేర బిలచిన నతడు నాకు వచ్చుటకు వీలులేదు. నాప్రతినిధిగ వకుళా దేవి యరుదెంచుచున్నదనగానే వరాహస్వామినద్ద సెలవు పుచ్చుకొని నిజ మందిరమునకు జని శేషాచలంబుపై నివసించియున్న యుమాపతి రమానాథు వివాహమునకు వచ్చుటకు బ్రార్థించె, నంత రవి చరమా ద్రిం బ్రవేశించె, నాటిరాత్రి యెల్లరు శేషగిరిపై నిలచి సంతర్పణ వగైరాథులు జరిపి వైవాహికమునకు చేత పైకములేకయుండు నెడ బ్రహ్మేంద్రాదులు కుబేరునివద్ద పత్రము వ్రాసియిచ్చి ఋణము గైకొన నెంచి వెంటనే ముక్కంటి చెలికానిరావించి కమలభవుఁడు శ్రీనివాసుని కల్యాణము నిమిత్తము సెలవునకు పైకము కావలయునని కుబేరు నడుగ నతడు వల్లెయనెను. పిమ్మట కోటి చతుర్థలక్షల రామటెంకీలకు పత్రమువ్రాసి ప్రతి సంవత్సరాంతమున వడ్డి, పైకము మాత్రం చెల్లించునట్లును, మొత్తమును కలియుగాంతములో యిచ్చునట్లును, యిందుకు సాక్షులు అశ్వత్థ వృక్షంబులను, యేర్పఱచి సకల సురముని గణము యెదుట నాపత్రమును చదివి వినిపించి, ద్రవ్యము గొన్నవారలై వలయు సామగ్రులు సిద్ధముచేయించి వంటపాత్రలు లేక యోచించి

శ్రీవారు వేంకటాద్రియందు యేర్పడియుండు ఇన్నూటరువది తీర్థములను బాత్రిలుగా నేర్పరచి పచనమొనర్ప యగ్నిదేవునకు ననుజ్ఞ యివ్వగా నాతడట్లే యొనర్చె.

పిమ్మట వేంకటాచలము మొదలు శ్రీశైలము వరకు నొకటే పంక్తిగా సమస్త బృందారకులును, ముని బృందమున్నూ, గూర్చొని భోజనంబులు చేసిరి.

అంతట కార్తికేయునివలన పాండుతీర్థము మొదలగు శ్రీగిరివరకు శుద్ధి వస్త్రాలు నిర్వర్తింపఁబడి వచ్చియున్న బంధువుల కెల్లరకుసుగంధ పుష్ప తాంబూలంబులొసంగినమస్కరించి తదాశీర్వాదములు గైకొని సభామంటపమున గూర్చుండి తాను పుష్పతాంబూలంబు నంగీకరించి వినాయయుక్తముగా సరస వచన సమన్వితుండైయున్న సమయమున ప్రొద్దుగుంకెను, సకల సురముని నికరము తమ కాంతలంజేరి యమితానంద కందళిత హృదయులై యారాత్రి యచ్చటనే నిదురించిరి. హరియును యొక విరిసెయ్యపైఁజేరి పవళించె. సిరి వకుళమాలయును పవళించి సుఖనిదుర జెందిరి.

తర్వాత మరునాఁడరుణోదయమునకు మున్న మేల్కొనియున్న సకల సురులు జయజయ శబ్దముల హరిని మేల్కొలుప లేచి స్వామి పుష్కరిణియందు స్నానము చేసి నిత్యకృత్యంబుల నిర్వర్తించి శ్రీపతి యజునిఁగని సత్వరము యెండ వేడిమి కాకమునుపే యెల్లరును ప్రయాణము గావింపుడన వల్లెయని నందరు ప్రయాణ సన్నిద్ధులైరి, అంత హరి గరుడారూఢుండయ్యెను. వకుళమాలిక పుష్పవిమానముపై యెక్కెను. తక్కిన వారెల్లరు వారి వారి వాహనములపై నధిరోహించిరి.

ఎల్లరు సాక్షాత్ శ్రీనివాసునితోడ మిక్కిలి వైభవముతో శేషాచలవరోహణ మొనర్చి శ్రీకపిలేశ్వరుని యాలయంబు ప్రవేశించి శుకాశ్రమంబుజేరి, శుకబ్రహ్మచే యోగక్షేమములు విచారింపఁబడి యుందే విడిసిరి, అంత యోగప్రభావంబున సకల సరస పదార్థంబులు తూర్ణంబుగా పూర్ణంబుగావించి యెల్లరకు విందొనర్చి చందన పుష్ప తాంబూలాదులచే నమ్మని వారల తృప్తియొనర్చె. వారెల్లరు మిక్కిలి యానంద కందళితులై యారాత్రి యచటనే గడిపి మరుసటి నవమీ గురువారమురోజు ప్రాతఃకాలమున నిద్దుర విడిచి నిత్య కృత్యంబులదీర్చి

శుకమహర్షి యుక్తముగా నెల్లరు ప్రయాణముచేసి ముహూర్తసమయమునకు నారాయణవనంబునకు సామీప్యముగాఁ జన నా పురాధిపతి యెరింగి తాను తన పరివార సమేతముగా శ్రీహరి నెదుర్కొని పూజాలింగనాది కృత్యంబుల నాచరించి సంతోషకలిత చిత్తులైయున్న తరుణంబున గగనమందుండి త్రిలోక సంచారియగు నారద భగవానుండు చనుదెంచిన నమ్మునివరునికి నెల్లరు నమస్కరించి. కుశల ప్రశ్నంబుల సల్పిరి. పిమ్మట నారదుఁడు సంతోషించి భూవల్లభునితో:—

ఓరాజచంద్రమా! నీభాగ్యమేమని కొనియాడుదు? శ్రీపతియే నీకు జామాతయై యిటునరుదెంచుట యెట్టిపుణ్యము, అని పలువిధముల గీర్తించుచుండ సమయంబున శ్రీయఃపతి కమలభవ భవునకు నమస్కరించెను. నారదుడాశీర్వదించె. అంత భూకాంతుడు విశ్వకర్మ నిర్మితమగు విశాల పవనయుక్త కల్యాణపురమును, రాజమార్గము ద్వారా ప్రవేశించిరి, అనంతర మాకాశరాజు గృహమునకు శ్రీనివాసుఁడును భూపతియును జనిరి. పిమ్మట గగనరాజు ఆమ్మునితో నింక యాలస్య మొనర్పక వచ్చిన వారెల్లరకును మజ్జన భోజనాదులు యిడ కట్టడజేసెను, అతఁడచే యొనర్ప బ్రంహేంద్రాదులు స్నానపానంబులచే తృప్తిజెందిరి, అంత వసుమతీకాంతుడు శ్రీహరి సమేతముగా వివాహమంటపము బ్రవేశించి నవగ్రహ హోమంబును సాంగముగ జరిపిరి. నాటిరేయి యెల్లరు శయనించి మరునాడరుణో దయమున నిదురలేచి నిత్యకృత్యంబుల నెరవేర్చి హరికి మంగళస్నానంబుగావించిరి

అనంతరము హరి వసిష్ఠుని గనుగొని నేనును లక్ష్మీయు కమలభవుడును, వకుళమాలయు, మీరును, మీదేవియు, భుక్తిగొనక యుండవలయునుగదా! అచ్చటాకాశరాజును, ధరణిదేవియు, తొండమానుండును పద్మావతి సహితముగ నుపవసించియుండవలయునుగదా! వీర్లను వదలి తక్కినవారు భోజనము చేయునట్లు, చేయుఁడని పలికిన వెంటనే వసిష్ఠులు ధనపాలకుల కాజ్ఞాపింప నతండు గగనరాజును బిలిచి వసిష్ఠులు దెల్పిన గ్రమంబంతయు విన్నవింప నతడు మిగుల సంతసించి మధ్యాహ్నకాల బ్రాహ్మణ భోజనంబులు జరిపి తర్వాత యెల్లరకును దక్షిణ తాంబూలము లొసంగి తన సోదరు నెదుటికి బిలిచి యిఁక ముహూర్తకాలం బాసన్నంబాయె ముహూర్తమునకు గావలయు వాని

నాయుత్తరరూపము. అతడు గురుని యనుమతి చొప్పున వానినెల్ల వివాహమంటపము జేర్చి సకల సామంతరాజు బంధుహిత పురోహిత సమేతముగ చతురంగ యుతముగా భద్రగజమున నలంకరించి మున్నిడుకొని శ్రీపతి వశించు మందిరమునకుంజని కమలభవ శంకరుల నడుమ వసించియున్న లక్ష్మీకాంతుని గాంచి యుప్పొంగుచు గగనరాజు వసిష్ఠులంగాంచి స్వామి! మీరెల్లరు శ్రీహరిని వెంటనంటి రావలయునట్లు ప్రార్థింప నతడటే చేయుదునని రాజుతో రాజపుంగవా! శ్రీహరికి జరుపవలసిన మర్యాదలు నీభార్య మొదలగు ముత్తైదువులు జరుప నియమింపు మనవు డటే భార్య కనుజ్ఞయిచ్చె. అమ్మానినీమణి లజ్జచే వసుంధతిని మున్నిడుకొని శ్రీపతికి దివ్యవస్త్రాభరణ తాంబూలంబు లిప్పించి శ్రీగంధముచే నలుగిడ పుష్పమాలికలు శిరంబునను గళమందును వైచనిన తొండమానుండు సభాతాంబూలం బిప్పించె. అంత శ్రీవారిని నైరావతంబుపై లక్ష్మీయుక్తముగ వసియింపఁజేసి సకల బ్రహ్మరుద్రేంద్రాదులు ఇరువంకల నడువ రంభాద్యప్సరసలు నాట్యంబులు సల్ప దివ్యవాయిద్యంబులు, భోరుసలుప పలువిధ బాణవేడుకలతో సహస్రభాను ప్రభలద్ధృణీకరించు నడువున బుడమీపతులు బలగముల తోడ కన్నులమిరుమిట్లు గొలుపునటుల రాజవీధిని మిక్కిలి వైభవంబుతో ప్రదక్షిణముగావచ్చి రాజు గృహద్వారముముందర నిలచిన తొండమానుండు భార్య మొదలగు సువాసినులుగూడి శ్రీహరియెదుటనిలచి కుంకుమోగకములచే నారతులిచ్చిరి,

—: శ్రీ వేంకటేశ్వర పద్మావతి పరిణయ మహోత్సవం: —

అంత భక్తానుమోదితాగు హరి నైరావతంబు దిగి సిరికరంబు దెమల్చి విరించి మొదలగు సురఋషి సంఘములతో నవరత్న స్థగిత కల్యాణ మహోత్సవ మంటపంబును బ్రవేశించి వివాహ వేదికపై నమర్చియుండు హేమాసనంబున లక్ష్మీయుక్తముగా గూర్చుండె. అంత భూపతి బ్రహ్మేంద్రాది సురుల యెదుట నిశ్చితార్థంబు గావించెను.

పిమ్మట కొందరు వన్నెలాడులు పద్మావతికి జలకమార్చి తడి యొత్తి దివ్యంబులగు వివిధాభరణములున్న జల్తారు పుటములచే నిండియుండు కాశ్మీరపు పుట్టంబు నలంకరించి బంగరు చాయగల కంచు

కము దొడగి సుగంధని ప్త చందనపుష్పములచే చక్కగ నలంకరించిరి. అంత యరుంధతీ మున్నగు సువాసిని మంగళ వాద్యములు భోరు కొలుప నావిలాసినీ మణిని గౌరీయాలయంబునకు గొనిపోయి పూజ లొనర్చి ప్రార్థనలతోడ వెంటనే నమ్ముగుదను మ్రొక్కించిరి, ఆవల ధరణీదేవి మొదలగు యాదవాంగనలు సమస్త భూసురాంగనలకు దక్షిణతాంబూలంబు లిప్పించి యాశీర్వాదంబులు జేయించిరి. తర్వాత పద్మావతిని పిలుచుకొని వచ్చి వివాహమంటపము చెంత తూర్పుముఖ ముగా తెరమరుగున నిల్పిరి.

అంత వసుంధరాకాంతుండు శ్రీకాంతుని చెంతకరిగి కన్నులార గాంచి సంతసించి ప్రదక్షిణము చేసి బంగారుకలశంబులచే దివ్యనదుల జలము దెప్పించి దేవతలెల్లరు జయజయ వినోదంబులుజేయ ధరణీదేవి కలశములోని జలమును బోయుచుండ గగనభూపాలుడు పాదంబులు గడిగి శ్రీవారి పదజలంబును తమ మౌళిభాగములయందు ప్రోక్షించు కొనిరి. కోశ గృహంబులు మున్నగు స్థలములయందు ప్రోక్షించిరి.

అంత పుడమికాంతుడు శ్రీకాంతుని వశిష్ఠాది మునిగణ సమ న్వితముగా తీసికొనివచ్చి వివాహవేదియొక్క తూర్పుభాగమందు పశ్చి మ ముఖముగా తెరమరుగున నిల్పిరి అత్తరుణంబున రాజేంద్రు డల్లునకు చీని చీనాంబరంబులును, అమూల్య రత్నాభరణంబులును నొసంగె. పిమ్మట దివ్య కుసుమాలంకృతమైయున్న నాపద్మావతి కంఠ మును శ్రీపతి కరంబున నునిచి వివాహమునకు వచ్చియున్న బ్రహ్మేం ద్రాదులు యెల్లరు విన గురుని యనుమతిచే అత్రిగోత్రోద్భవుండను, సుధర్మరాజ పుత్రుండను గగనభూపాలుండనంబడు నేను నాకూతు పద్మావతిని యనిలు సాక్షి నీకొసంగుచున్నవాడ ఇకన్యను నీవు చేట్టంబట్టి ధర్మార్థ కామ మోక్షాదులయందు బాగొని రక్షింపవలయు నని ప్రార్థించిన, సకల ఋషులు మంగళాష్టకంబులు చదువ హరి వసి ష్ఠుని యనుమతి చొప్పున వసిష్ఠ గోత్రోద్భవుండను శూరసేన మహా రాజ పౌత్రుండును, వసుదేవ సుతుండును, సమస్తజన సంకట హారణా ర్థమై శ్రీవేంకటాచలంబున వసియించి వేంకటేశ్వరుండనంబరగిన నేను అత్రిగోత్ర సంజాతయైన పద్మావతిని అగ్నిసాక్షిగా చేపట్టెదనని

తద్ధారాబలం బందినవాడై యున్నతరుణంబున పుడమి లేదు సాగరంబు చందమున నుప్పొంగెను.



—శ్రీ వెంకటేశ్వర పద్మావతి వివాహ మహోత్సవము.—

అంత శ్రీపతి యాకన్యకామణి పాణియందు కంకణముగట్టెను. పిమ్మట మంగళతూర్య నినాదంబులు బోయకొలిపెను. మునివరులెల్లరు నిగమ వచనంబులు సుదమంబుగ బఠించిరి. పుణ్యాంగనలు కల్యాణ పాటలు పాడిరి. సురులు దివ్య కుసుమవర్షము వర్షించిరి. కంబుకంఠి కంఠమందు మంగళసూత్రిముగట్టి, యక్షతారోహణంబుచేసె ముత్యాల తలంబ్రాలిరువురును వారివారి దోసిళ్ళచేనుంచి మహాళిభాగంబుల పై జల్లుకొనిరి. ఇట్లందరు సంతోషసమయంబున నున్న వధూవరుల మధ్య నున్న తెరనుదీసి పద్మావతి శ్రీహరిని కల్యాణపీఠపై గూర్చుండబెట్టి యరుంధతి పూజగావించి మరియు నా రాజ దంపతులకుం షోడశ మహా దానంబులు వేరువేరనిచ్చి సభాపూజ గావించిరి. పిదప సకల బ్రహ్మేంద్రాదులకు సభాతాంబూలాదు లొసంగి యందరును భోజనంబులు జేసిరి, విడెమొసర్చిరి పిమ్మట ఎల్లరును నారాత్రి శయనించిరి. మరునాడరుణోదయమున నెల్లరు మేల్కాంచి కార్యకరణీయంబుల యథావిధిగా సల్పి వధూవరులకు మంగళస్నానంబుచేయించిరి. పిదప ఎల్లరు సంధ్యావందనాది అనుష్టానంబులు చక్కగ నిర్వర్తించి అందరు

భుజించి తాంబూలాదులువేసుకొని సంతుష్టిత స్వాంతులై యున్న యెడ సూర్యాస్తమాన మగుటవలన నెల్లరు శయనించి మరునాడు సూర్యోదయమున మేల్కాంచి కార్యకృత్యాలాపంబులు సల్పి సముచితంబుగా హరికిని, పద్మావతికిని, యలంకరణంబొనర్చి శృంగారంబు జేసియున్న పాన్పుపై యిద్దరిని నివసింపజేసి పద్మావతివలన హరికి నలుగు వగైరాలను చేయించి యరుధంతి మొదలగు ముత్తైదువలు పాటలుబాడి, తాంబూల పుష్పఫలంబులొసంగి పిమ్మట హరికి మంగళ హారతులిచ్చి పాన్పుపై నుంచి విడిదికి పంపిన తదనంతరం బెల్లరు భుజియించి విడెము లొనర్చి సంతసంబున నున్నంత సూర్యాస్తమయమగుడు నందరు శయనించిరి. మరునాడందరు నిదురలేచి నిత్య కృత్యంబులు నిర్వర్తించి యున్నతరి హరిని యొక రమ్యసౌధతలమునందు పద్మావతి యొసంగియుండిన బగారు కలశమునందు కొనిపోయియుండ అంత నరుంధతి మొదలగు సువాసినులు పద్మావతికి నలంకారమొనర్చి శ్రీపతియున్న రమ్య గృహమునకు తీసుకవెళ్ళి పద్మావతిచే హరికి చందనాద్యలంకరణంబొనర్చి మిగుల మందహాసముతో వియ్యంకులెల్లరు వారినిగని మీరెందులకై యిందరు దెంచితిరి? మీరిచట నరుగుదెంచు నపుడు యీ హేమపాత్రిలనేలదెచ్చిరి? ఈబ్రింహేన్ద్రాంద్రాదుల యెదుటను లక్ష్మి ఎదుటను, మీరిట్టికార్యమొనర్పవచ్చునా? ఇకార్యము మాకు మిక్కిలి యవమానకరముగాదా? ఇట్టితరుణమున మీరలుకం బూన వచ్చునా? పోనీ మీరీపెండ్లియగు సెలవునకుగాని, చెంబును హరించితిరి కాబోలు మీకెట్టి ఋణభాధచే భాధకలుగుపట్ల మీమామ గగనభూపాలు నడిగితే కావలయునంత ధనము ఇవ్వకబోయెనా? యని యనేక హాస్యభాషణంబులొనర్చుచు పద్మావతి కరంబున హరిచేనిడి నృత్యగీతవాద్యంబులతోడ వధూవరుల పెండ్లి పీఠపై గూరుచుండ జేసి వారికి శిరములంటి సభ్యంగన మొనర్చిరి. వెంటనే తడియార్చి వస్త్రిభూషణాలంకృతుల గావించి పెండ్లి పీఠపై నివశింపంజేసి బలి దేవతార్చనలు సల్పి పద్మకు నీలమణి ధారణంబొనర్చి ఫలదానంబులొసంగి, సువాసినులకు దక్షిణ తాంబూలంబు లిప్పించి యంత యధావిధిగా కంకణ విసర్జన మొనర్చిరి. అనంతరము వసిష్ట, యరుంధతులు మొదలుగాగల వారికి, దంపతిపూజ గానించిరి. పిమ్మట భక్ష్య, భోజ్య, శోష్య,

లేహ్య పానీయాదులతోడి యెల్లరు భుక్తింగొని సాయంతర మా పుర మెల్ల ప్రదక్షిణము మిక్కిలి వేడ్కగా నొనర్చి నగరు ప్రవేశించి సుఖముగా నున్న సమయంబున ఒకనాడు హరి వేంకటాద్రికి పోవ యత్నించియుండుట దెలిసి రాజపత్ని భర్తకు సంగతి దెలుప నతఁడు హరింగని శ్రీవల్లభా మీరీ నాగృహంబున ప్రవేశించుచుండగనే నేను మాగృహములు యెల్లరును గడుధన్యులమయితిమి. కాన మీరిచ్చోటనే యుండ ప్రార్థించుచున్నాననిన హరియిట్లనియె.

అయ్యా! ధర్మరక్షణార్థమైన కార్యంబు లనేకంబులు గలిగి యుండుటవలన నేనెట్లిచ్చోటున నుండవచ్చును? నేనా కార్యంబులు సలుపవలదా? యనెను. అంత భూకాంతుడు శ్రీపతితో హే పుండరీ కాక్షా! మాసుతె పద్మ మిక్కిలి చిరుతప్రాయముగలది. ప్రౌఢకాంత గాదు! ఎట్లు దాని నీవెంటఁబనుప దనుఁడు హరి యప్పుడు పద్మావతికి కనుసన్నచే యెరింగించ నాయమ్మ తండ్రిగాంచి నాయనా! నాకేమి నేను నాభర్త యెచ్చటికేగునో నచ్చట నేనుండుట ధర్మముగాదా? కాన మీమనంబుల దవిలియున్న సంశయపాశమును ద్రెంచుచు నన్ను నాభర్తవెంట బంపుడు అనుఁడు తండ్రి సంతసించి లోపలికింజని తన ప్రియురాలైన ధరణీదేవింగాంచి హరి విన్నవించిన వృత్తాంతమును దెల్పి తన కుమార్తెను హరి వెంటఁబనుప నిశ్చయించినవాఁడై తన కూతుకు గావలయు స్త్రీధనం బాయత్తబరచి లక్ష్మీనారాయణ పద్మావతులకు దివ్యాంబరములు యిప్పించి నవరత్నఖచిత యమూల్యాభరణంబులును, జతపరచి బ్రహ్మాదిసురులకును సావిత్రి మున్నగుపుణ్య స్త్రీలకును దివ్యాంబరములు యిప్పించెను. అంత శ్రీపతి అత్తమామల యనుమతిగొని యెల్లరివద్దను సెలవుగైకొని ప్రయాణోన్ముఖుఁడై యుండ ధరణీదేవి కూతుం గుస్తరించి పలువిధముల తన్ను బాపి విడిచి పోవుటకు జాల మన మలమటనొంద యిట్లనియె. అమ్మా! కుమారీ! నీవెట్లు నన్నొంటరిగా విడిచియుండగలవు. నిన్నువిడిచి యర నిమిష మయిన నోర్వగలనా! నన్నుగన్నతల్లీ! నీవు మట్టుమర్యాదపు నడతగలిగి పుట్టినింటికి మెట్టినింటికినీ కీర్తింగడుపుము. నీభర్తభావము ననుసరించి నడువుమని కన్నీరొలుక బలుక తల్లింగనియు కుమారి కను దమ్ముల

హిమబిందువులబోలి బాష్పబిందువులొలుక మాతా! నిన్నువదలి నే నెట్లుండుదును? అని యూరకుండుటంగాంచి లక్ష్మియిట్లనియె, అమ్మా! హరి ప్రయాణమై సిద్ధముగానున్నాడు. మీరు పద్మావతిని వేగముగ ప్రయాణించి పనుపుడు యనిన ధరణీదేవి సిరినిగాంచి అమ్మా! మా బిడ్డ యాటపాటలు మరిగియున్నదేకాని యేపనియుజేసి యెఱుగదు. పాలముంచినను నీళ్ళముంచినను నీభారమని సిరిచేతికి పద్మావతి కరమును బట్టియిచ్చి కన్నీరించుచుండెను. పిమ్మట తల్లి కూతుఁగాంచి అమ్మా! నేనును మీతండ్రియును పలుమారు వచ్చుచుండెదము. నీవు నీభర్తకనుసన్నమెలఁగి యరుంధతివలె కీర్తిగడిపింపు మనుచుండ ఆకాశరాజువచ్చి కూతుంగాంచి పిలుచుకొని లక్ష్మీవకుళమాల ముఖాంతరమున నిలిపి నాహరిని యనేకవిధంబుల పొగడి పద్మావతి జన్మవృత్తాంతమంతయు నెరింగించి లేక లేక గలిగిన యీకూతు నీచేతఁ బట్టియిచ్చితి యిమ్మగువ నెట్లుపోషించెదరో పుండరీకాక్షా! యని పలువిధముల బొగడి కుమార్తెను దీవించి చెప్పదగిన నీతుల నెల్ల బోధించి కుమారితను శిరము మూర్కొని ముద్దిడి కన్నుల జలపూర్ణితములై యున్న తండ్రికి పద్మవందనంబిడి నిలిచియున్నతరి తన సుతకు ఇన్నూరు బారువుల బియ్యమును, ముప్పది బారువుల పప్పును, నలువది ఐదు పుట్లు చింతపండును, నెయ్యిన్ని ఇన్నూరు పాలకుండలును, అనేకమయిన నేతికుండలును, చక్కెరకాగులును, వుగ్రాణమునకు, కావలసిన మెంతి జిలకర మొదలగు దినుసులును, కదళి కుష్మాండము మొదలగు శాకంబులును, చెఱుకు, మామిడి, పనస, నారంజి, కదళి, మొదలగు ఫలదినుసులును, స్త్రీధనంబిచ్చిన శ్రీ శ్రీనివాసమూర్తి యీవస్తువులెల్లను జూచి మిక్కుటమగు సంతోషముతో నవ్వి యీవస్తుజాలమెందులకు? దీని నిచ్చోటనుండి యెటుగొనిచనవచ్చు ననవుఁడు రాజు శౌరింగాంచి మహాత్మా! సకల చరాచర సృష్టిజాలముల నెల్ల మీకుక్షి యందిడుకొని భరించువారికీ వస్తుజాలము బరువా? ఇవి మీకుబరువై దోచిన మాభాగ్యమేమనవచ్చు. అని నిష్ఠూరముగా నాడిన మాటలు విని హరి యియ్యకొనియె. హరి అత్తమామలకు నమస్కరించి వారి దీవెనలబొంది యున్నంత పద్మావతి తోడి చెలులంగని తన పోయి వచ్చుట నెల్లరకును దెలిపి తన తల్లిదండ్రులకు నమస్కరించి శ్రీహరికి

యభిముఖముగా వచ్చి నిలిచిన గరుత్మంతునిపై లక్ష్మీ, పద్మావతీ యుక్తముగా నారోహించి వివిధ వాద్యములు బోరుసెలంగ బ్రహ్మ రుద్రేంద్రాదులు సయితము తొండమానునితో సాయంతరమునకు అగస్త్యాశ్రమమును జేరిరి. ఎల్లరు నచ్చటనే విందారగించి యారాత్రి గడిపి సూర్యోదయమునకులేచి నిత్యకృత్యములు నెరవేర్చి హరి యాజ్ఞను బొంది వారివారి స్వస్థలములకు జనిరి.

అంత శ్రీనివాసుడు పద్మావతి యుక్తము వేంకటాచలముచేర ప్రయత్నించు నంతకు సిరి వారినిఁగాంచి నమస్కరించి నేనా కొల్లాపురమున గరుగు దెంచెద, సెలవొసంగుడు, అనగానే హరి లక్ష్మినిగాంచి కరంబులు పట్టుకొని తరుణీ నన్నొంటరిగా విడిచిపోవ న్యాయమా? నన్నువదలిపోవ నీమనంబెట్లొయ్యకొనె, అనుచుండ లక్ష్మీ నాథా నేనింపుండిన పద్మావతిని మిమ్మెడబాపిన దాన నగుదును. యని నాకు సెలవొసంగిన ఎప్పటివలె కొల్లాపురము ప్రవేశించి యచ్చటనే సుఖించెద. అనుడు హరి యక్కమలనుగని తరుణీ నేను రామచంద్రుడనై యున్నప్పుడు నేనీ యుతివకొసంగిన వాగ్దానమును వారింపవలయుగదా! అందుచే నీ యిందుముఖిని నే వివాహమాడితి. కాని యొండుగాదు. ఈయుదంతంబంతయు నీకు మున్నె యెరిగించి యుండియు నీవది గమనించకనే యిట్లుబలుక తగునా! నన్నెడబాయ నగునా! అనినవిని సిరి హరితో నాథా నన్నును మిమ్ము నెడబాపిన వారు భృగు మహర్షి వారే మన యెడబాటునకు కారకులు అయిన నేమాయె నామాటపై మీరీ చెలిని చెట్టబట్టితిరి. అదియె నాకు గౌరవము. ఇది మొదలు పద్మావతిని యేలుకొనుడు. నేను కొల్లాపురము ప్రవేశించి యథావిధిగా తపంబొనర్చికొనియెద, నని పద్మావతిని వకుళమాల కప్పగించి తానెప్పటియట్లు కొల్లాపురము ప్రవేశించి భక్తుల మొరనాలకించి వారి పూజలంబడసి వారి యీప్సితంబుల నెల్ల యిచ్చుచుండె,

అంత పుండరీకాక్షుడు అగస్త్యాశ్రమ మందే కొన్ని దినంబులు గడిపి యమ్మునీంద్రుని సెలవుగైకొని శేషాచలమునకుబోవ యత్నించుచుండ అగస్త్యులవారు హరినిగని ఓ దయామయా! వివాహమాడిన వారారు మాసములవరకు శైలారోహణంబు సేయంజనదు. కాని

యీయష్టమాసంబులు మీరిచ్చటనే వసింపవలయునని తపోధనుండన హరి దానికియ్యకొని యచ్చటనేయుండె.

ఇట్లు, శ్రీనివాసుడు పద్మావతి సమన్వితముగా నయ్యాశ్రమమందే నివశించి యున్నంత భగవానునికి వివాహమైన యారవమాసమందే గగనభూపాలుడు గతించెను. ఆవృత్తాంతమంతయు చారులచే విని యప్పుడే పద్మావతితోడ గదలి నారాయణవరమును ప్రవేశించి మృతినొందియున్న యాకాశరాజుంగాంచి మిగుల వగలంబొగలి తొండమానుని దుఃఖముమాన్పి వసుధానునిచే తండ్రికి చేయవలసిన కరమ క్రియలం జరిపి మరల యథారీతి లోపాముద్ర ప్రాణవల్లభుని తోడను సహధర్మచారిణితోడను, అగస్త్యాశ్రమము జేరి తండ్రిమరణమునకై దుఃఖించు పద్మావతిని యూరడించె. యచ్చటనే నివశించి యుండెను.

## తొండమానుని వసుధానుని యుద్ధారంభము.

ఇట్లు, కొంతకాలమునకు తొండమానునికి వసుధానునికి భూపరిపాలనాది కార్యములందు వైరముగలిగి యిద్దరును కలహమునొంది మంత్రివర్గాదులు యెంతజెప్పినను వినక యుద్ధమునం దెవరు జయమొందుదురో వారికే రాజ్యాభిషేకము జరుగవలయునని, కోరి ఘోరయుద్ధంబు సలుప యత్నించి చతురంగ బలసమేతులై యివ్విధమును శ్రీ శ్రీనివాసమూర్తికి యెఱింగింప దలచి యచ్చటికిం జనుదెంచిరి. అప్పుడు వారి మనోభావమును గనుగొన్నవాడై మిగుల వ్యాకులతో నాకంతరంగ భక్తుడైన తొండమానునికి, దోడుపడిన పద్మావతి దుఃఖాధిక్యత జెందును. వసుధానునికి తోడ్పడుదమన్న నాకు బావమరదియు, తొండమానుని కుమారుడునై యున్నాడు. ఇందు ముందు నడచిన నూయి, వెనుకకు నడచిన గోయి యన్నట్లున్న దేయని యోచించి, తనమామగారగు తొండమానునిని యొక మరుగు స్థలమునకు రావించి అతని వృత్తాంతమంతయు, విచారించి తనయొద్దనుండు సుదర్శనాస్త్రమతనిచేతికిచ్చి పంపిన పిమ్మట తన బావమఱది యగు వసుధానుని రావించి విచారించి నీకేమి కావలయునని, యడుగ నందులకు వసుధానుఁడు శ్రీహరి సహాయమును గోరినందులకు శ్రీహరి

సమ్మతించి యందరును నారాయణ పురంబును ప్రవేశించిరి.

అంత మరు దినము సూర్యోదయమునందు యిరువాగుల వారున్ను తమ బలంబులతో యుద్ధభూమికిబోయి సంగరము చేయ ప్రారంభించిరి. అట్టి యుద్ధమునందు తలలు తెగినవారును, మొండెము లతో పడియున్నవారును, ఇంకా అనేకవిధములైన అంగ విహీనులును నెత్తురు వెల్లువలై పార, నందు మునిగిపడియున్న శవములను లెక్కిడ సాధ్యముగాక స్మశానభూమి మోస్తరు పరిధవిల్లియుండెను. అప్పుడు శ్రీపతి సహాయము కోరిన వసుధానుండు కన్నుల నిప్పులు గ్రక్కుచు మహాకోపోద్దీపిత మానసుండై తొండమానుని రథమున కెదురుగా తన రథము బోవనిచ్చిన నతడు కోపోద్దీపిత మానసుండై వసుధా నునిపై యనేక విధముల బాణవర్షంబులు గురిపింప నంత వసుధానుడు మండుచున్న యగ్నివోలె నొక యస్త్రమును ప్రయోగించిన తొండ మానుడు గనలి మిక్కిలి భుజవిక్రమము కనబడునట్లు నొక చక్రమును యెత్తి హరిని ప్రార్థించి వసుధానునిపై ప్రయోగింప నది మిగుల భయంకరాకారముతో భూమ్యాంతరిక్షములు ప్రతిధ్వని లెసగవచ్చి వసుధానుని దాకు సమయంబున,

## హరి చక్రముచే మూర్ఛనొంది తెలివొందుట.

హరి చెచ్చర నడ్డమువచ్చి వసుధానుని రక్షింపనెంచు నంత నా యాయుధము శ్రీహరి వక్షంబున దాకెను. అంత హరి మూర్ఛ నొందెను. పిమ్మట తొండమానుడు పశ్చాత్తాప హృదయముతో చెంతకుజని హరి శిరంబు యూరువునందిడుకొని ధైర్యమును గోలు పోయినవాడై యనేక శిశిరోపచారంబు లెల్లను సల్పెను. హరి పాద కమలములు వణుకుచుండ కొంతసేపటికి సేదదేరి కన్నులు దెఱచి నలు ప్రక్కలంగాంచెను. పిమ్మట లేచి యాసీనుడైయున్న సమయంబున తొండమానుండు మిక్కిలి వినయంబుతో శ్రీహరింగని ఓ జగదీశా! మిమ్ముల గన్నప్పుడు మిమ్ము పూజింపవలసినది మాని యీవిధముగా మిమ్ము బాణఘాతంబులచే నొప్పింపవలసి వచ్చెనే మహా పురుషా! మిమ్ము యిట్టి బాధకులోజేసి మహాపాపినైన నా యొక్క పాపములకు నిష్కృతి యెట్లుగలదు? ఇంతటి నికృష్ట కార్యములకు

మూలము రాజ్యలోభముగదా? ఇట్లు మిమ్ము నొప్పించిన పాపాత్మునకు రాజ్యంబెందుకు? యీయాయుధంబులెందుకు? మహానుభావా! నేను మీయెడల గావించిన మహాపాతకమును బోగొట్టుకొనుటకై కాశి ప్రయాగ మున్నగు దివ్యక్షేత్రముల యాత్ర సలుప నుద్యుక్తుడనై యున్నాడ, నాకు సెలవొసంగుడన హరి యందుల కియ్యకొనియె. అంత వసుధానుని రావించి హరి మీపినతండ్రి రాజ్యకాంక్షవదలి కాశీ యాత్ర బోవనున్నాడు గాన నీవీరాజ్యము నంతను సుఖముగా పరిపాలింపు మనుడు, వసుధాముడు మిక్కిలి వగచి బావా మిమ్ము బిలచి రణరంగమున మీకిట్టి యకృతి యొనర్చిన నావంటి నికృష్టునికి రాజ్యకాంక్షలేల? ఇయ్యాయుధము లెందుకు? నాకివి యెల్లను విషతుల్యములు, నేను మీపాదసేవజేసికొని తత్పాపములకు నిష్కృతి యొనర్చుకొందు గాతయని పలికెను. అప్పుడు శ్రీనాథుడు శుకాగస్త్యుల రావించి వారిచే వీరిరువురకు హితోపదేశముజేయించి వారి ప్రాజ్ఞుల రాజ్యభాగమును న్యాయానుసరణి పంచియివ్వ వారిరువురు రమందానంద కందళితహృదయులై తద్భాగంబులనిడుకొని సుఖముగ పాలించుచు నుండిరి

## తొండమానుని పూర్వజన్మ వృత్తాంతము.

ఇట్లుండ తొండమానుడు పూర్వజ్ఞానమును దెల్చుకొని యింత కాలమునకు రాజ్యపాలన మొనర్చి యెట్టి సుఖము ననుభవించితి? ఇంక నెన్నిజన్మము లెత్తవలసియుండునో గదా! యని పలువిధముల తనలో దావితర్కించి స్థిరచిత్తముతో యా జగత్పతిని యారాధించినవాడై యది మొదలు భగవంతుని బంగారు పుష్పములతో పూజింప దలచినవాడై సంసారం బసారంబని దారా పుత్ర పశు క్షేత్రాదుల యందు విరక్తిజెంది తన ధనంబంతయు సద్వ్యయమునకు సర్వాత గావించి యగస్త్యాశ్రమ మందుండు పద్మావతి సమన్వితుడైన హరి చెంతకేగి సమస్కరించి నిలిచిన రాజునుగాంచి హరి చిరునవ్వు నవ్విన రాజు పలనవ్వితిరియనుడు హరి మామా పిన్నపెద్దలను తారతమ్యములేదా నేను చిన్నవాడనైయుండుటవలన మీరు నాకు నమస్కృతియొనర్పదగునా?

యన, రాజు పరమాత్మా! మర్యాదలు వావి వరుసలు, పిన్న పెద్ద తనములు మున్నగునవి గనుపరచి నన్ను మరల సంసారసాగరంబున బడఁద్రోయ నెంచెదరా? ఓ నిత్యానందస్వరూపా! నేనిదివర కెన్ని రూపము లెత్తితినో? ఇఁక నెన్నిభవము లెత్తవలసి యున్నదో నేనెట్లు యెఱుంగుదును జగత్పరిపాలనా! నేనిదివరకు ఆర్యులవలన కొంత వినియున్నాడను. అది యెయ్యదియన, యిబ్బువనంబున జనించియున్న యెనుబది నాల్గులక్షల జీవకోట్లయందు నరజన్మ మిక్కిలి యుత్కృష్ట జన్మమనియును, అన్నిటికంటె నిది కడపటి జన్మమనియును ఇజ్జన్మమునం దే జగద్రక్షకుఁడయిన పుండరీకాక్షు మదినిడి ధ్యానించి వారిసేవల పూజలొదనిపి కడపట ముక్తి జెందవలయునని ఇంకొక జన్మమునందిట్లు జేయ వలనుపడదనియు విని యది మొదలు నా పరాత్పరుని యందు మనంబునుంప త్రికాలములయందును త్రికరణశుద్ధిగా పరమేశ్వరుని ధ్యానించి పూజించి ముక్తినొందద మనంబున దలచియుండునట్టివారికైన నీవు నాకల్లుఁడైనను నాకు ముక్తినొసంగునట్టి నిన్ను తండ్రిగా భావించి సేవించుచున్న నాయందు పిన్నపెద్దల తారతమ్యం బెట్టుల బెట్టితిరో నేనెట్లు నెఱుఁగుదును,

అని యిట్లు వినయంబు తేటపడునట్లు పలుకుచుండు తొండమానునిగని మిగుల సంతసముతో మామా! మీ రెందులకిట్లు పరితపించుచున్నారు? మీరీతక్షణంబు మీపురంబునకుసరిగి రాజపరిపాలనం బొనర్చుచు సద్విషయంబుల మెలగుచుండుడు. మీరాకు లెగ్గగుననుడు రాజు మనుజునికి నూరేండ్లాయువు, అందు సగంబు నిద్రచే పన్నయ్యె. మిగుల సగము బాల్యవృద్ధాప్యము నందును, యౌవనము నందును, భార్యాసుతుల జీవనాధారమునందును నశించుచున్నది. నిజము నెంచి చూడ నగునకు మిగిలినకాలమెద్ది? ఇట్లుండ భగవంతుని ధ్యానాశక్తిచే యుండుట యెట్లొప్పు, తుదకు మనుజుడు నరకభాజనుడగుట తథ్యము కాన ఓ పరంధామా! తమ కృపాకటాక్ష వీక్షణ్యంబున

నాయందు బ్రసరింప జేయవే యనుడు హరి మిక్కిలి యుప్పొంగి



తొండమానునికి హరి విశ్వరూపము జూపుట.

తన విశ్వరూపంబు జూప యాతఁడు తద్రూపముంగాంచి హే పరమ పురుషా! హే జగత్పాలనా! హే అనాథరక్షకా! మిమ్ము బొగడ నేనెంత వాడను, నీవల్లుండనని యెంచి నీచే వందనంబు గైకొనియున్న నేనెంత పాపియగుదునో మీరే యోచించుడు. మహాస్వరూపా! నీ రూపంబును వర్ణింప చతుర్వదన, పంచానన, షడానన, సహస్రాననులకే సాధ్యముగాదన్న నేనెంతవాడను. అని యిట్లనేక రీతుల విశ్వరూపుని బొగడుచుండు తొండమానునిగని యెప్పటియట్ల శాంత రూపమును గనెను, అంత కమలాపతి చిరునవ్వు చెంగటిల్లు మోముతో మామా! నన్ను మీరు పలువిధముల గుర్తించి పూజించుచున్నారు. కాన నా నివాసస్థానముగు వేంకటగిరియందు నతిసుందరమగు నొక మందిరంబును నిర్మించి బంగరు మయమగు గోపుర కలశములును, కవాటంబులును శాస్త్రోక్తముగా నిర్మించి నన్నచట స్థాపనజేసి పూజించుచు. సేవించు చుండుము. ఇదిగాక నీవు తొల్లి త్రవ్వించియున్న బావిని నూతనముగా గట్టించులాగు నేర్పాటు చేయవలయు ననుడు రాజిట్లనియె, ఓరమారమణా! నేనెప్పుడు వేంకటాద్రికి వచ్చితి, బావి

నెప్పుడు గ్రోవ్వించితి? నని పలువిధముల వితర్కించుచుండు రాజ వల్లభునకు హరి యిట్లనియె.

పూర్వము గోపీనాథుడను నొక రాజపుంగవుండు హరి సేవాపరుడై మిక్కిలి పూనికతో తపంబొనరించ, నే నందులకు మెచ్చి కృష్ణుని రూపముధరియించి యతనికి ప్రత్యక్షమైతిని. అప్పుడేను నీకేమి వరము కావలయునను రాజు నన్నానేక విధముల స్తోత్రమొనర్చి దేవా! మిమ్మెప్పుడు సేవించుచు, పూజలొనర్చుచు నుండునట్లు వరంబొసంగవే యనుడు హరి యిట్లనియె, నేను వేంకటాచలమునందు నవతరించెద. అప్పుడు నన్ను పూజించుచు, ధ్యానించుచు నుండెదవేని నీకోర్కెలు చేకూరుననియె.

—: తొండమానునికి హరి గోపీనాథుని చరిత్రమును దెల్పుట :—

పిమ్మట రాజచంద్రా! నీవు వెంకటాద్రికి నేగునప్పుడు నా మార్గమునందు రంగదాసుడను నొకభక్తుడు నీ కగుపడును, అతని నీవెంటగొని వెంకటాద్రికి నరగి యతని వలన పుష్ప తులశీదళంబులను గైకొనివచ్చి నన్నెల్లప్పుడును పూజించుచుంటివేని నిన్ను రక్షించి, నీవశంబున జననమొందిన నెల్లవారలచే పూజలందుకొనుచుండెద నని వరములిచ్చి యంతర్ధానుండైన, నదిమొదలు నా గోపీనాథుండు హరిని మదిని దలంచుచు వెంకటాద్రికిజన బ్రయత్నించి వచ్చుచుండ త్రోవమధ్య శూద్రకులజుడు రంగదాస నామధేయుడొకడు రాజపుత్రునింగాంచి నమస్కరించి, స్వామీ మీరింత క్షిప్రముగ యెచ్చట కరుదెంచెదరు? యెరిగింపవే యనుడు, నతని భక్తివిశ్వాసములకు మిక్కిలి నచ్చెరునంది రాజు తన వృత్తాంతమంతయు నెఱిగింప రంగదాసుడు, స్వామీ నన్ను నీ శిష్యునిగా జేసికొనుడన బ్రార్థించ నందులకు రాజంగీకరించి యానందించెను.

అంత నయ్యిరువు రేకీభవించి పర్వతారోహణ మొనర్చి నన్ను గాంచి యనేక విధముల బూజించుచు యందే వాసము చేయుచుండిరి ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట, రంగదాసుడొక పుష్పవనమును నిర్మించి జాజి, విరిజాజి, పొన్న, పొగడ, మల్లె, మొల్ల మున్నగు పుష్ప చెట్లను తుళసీవనమునుబెట్టి వానికొఱకై యుదకనిమిత్తమొక బావిని

త్రవ్వి యాబావి నీరును నాతోటకు చల్లుచు నాపుష్పంబుల గైకొనివచ్చి నా కైంకర్య మొనర్చుచుండిరి.

## రంగదాసునకు గోపీనాథుడు శాపం బొసంగుట

ఇట్లు కొంతకాల మరిగిన పిమ్మట రంగదాసుడు వనమునకు జని నందలి పుష్పంబుల నెల్ల చిదిమి నొక బుట్టయందుంచి పుష్కరిణీయందాచమనంబొనర్చి యచ్చట జలకంబులాడుచున్న గంధర్వకన్యలం గని తన చిత్తము మన్మథాయత్తమై తత్తరంబునుబొంది పిదప చిత్తస్వాస్థ్యపరచి తనబుద్ధి మార్చునకు జాల చింతించి మిగుల భయము ను బొందినవాడై మరల పుష్కరిణియందు స్నానమొనర్చి వెంటనే పుష్పములు గైకొనివచ్చి గోపీనాథుని చెంత నివ్వ, నతడు మిక్కిలి కినుకఁబూని యదిమొదలు నీవిచ్చట నుండుట కనర్హుండవు నీ వీస్థానము ను వదలి యధోలోకము జేరుదువని శపించిన, నతడు మిక్కిలి పరితపించి హరిని యనేక విధంబుల బ్రస్తుతించిన హరి ప్రసన్నుడై రంగదాసునిఁగని హరి యిట్లనియె. రంగదాసా! నీవేల పరితపించెదవు? ఈ రాకుమారుని వాక్యము మోఘము, దానినితప్పింప నా తరముఁగాదు నీవిక చింతించ నిష్ప్రయోజనము, నీవద్దానిని యనుభవించే తీర వలయు సుమా? 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్' అన్నటుల దీనిఁగాదన నెవరితరము.

జలములోని యశుద్ధ పదార్థము‌ను జలచరములు భుజించి జలమును శుద్ధిపఱచునట్లె నా భక్తులయందలి పాపంబుల పరిహరించి వారిని గాపాడ నేనుత్సహించియుందు. అయిన నేమాయె నీవు నాకు భక్తుండవు కాన నీదోషములెల్ల నాకు సమర్పించి నీ పుష్కరిణియందు స్నానమొనర్పుము. అప్పుడే నీవీ శరీరమును వదలి భూలోకంబునను ధర్మరాజునకు నాగకన్య గర్భంబున జనియించి యిప్పటియట్లు నన్ను బూజించి నాభక్తుడవై యుందువని యూరడించి పంపియున్నాను. కావున నా రంగదాసుడ నీవే అట్టిసమయంబున నిన్ను రక్షించ వరం బొసంగిన శ్రీనివాసుడ నేనే. ఇప్పుడేను నీకల్లుడనైతినని దెల్పిన నా తొండమానుండు పరమానంద బరితాంతఃకరణుడై శ్రీరమణునిం గని సెక్కభివాదంబు లొనర్చి మహాత్మా! నిన్నభివర్ణింప నేరితరము

నాకు ముక్తినొసంగు దేవత్వైన నాజన్మవిషయంబెల్ల యెరింగితి.

—: తొండమానుడు హరికి స్వర్ణాలయంబు తయారుచేయుట :—

అని పలువిధుల స్తుతియించి యతని యనుమతింబొంది నొక శిల్పినిరావించి తాను ముందుత్రవ్వించిన బావింగాంచి యానందింపుచు భక్తవత్సలునకు నూతనాలయముం గావింప శిల్పి శాస్త్రోక్త ప్రకార ముగా నతనిని తయారుచేయ నియమించ నతడు గోపుర మంటప ప్రాకారాదులు నేర్పరచి వానిమధ్య బంగారు విమానము నిర్మించి కలశస్థాపనముగావించి, విశాలమగు తిరువీధులును గజ వాజి, శాల లును, మధ్యమధ్య మంటపాదులును, శ్రీవారికి యుత్సవంబునకు గావ లయు సామగ్రులను మొదలగువాని నెల్ల తయారుగావించి యచ్చట నుండి బైలుదేరి శ్రీపతి వసియించియుండు అగస్త్యాశ్రమముంజేరి హరనిగని, ఇవ్వార్తనంతయుం దెలుప సంతసించి వేంకటాద్రికి బోవ యత్నించుచుండ నవ్వార్తనంతయు చారులవలన విన్న బావమరది యగు వసుధానుడు తెలిసి తక్షణము బైలుదేరి తన బావగారివద్దకు వచ్చి సాష్టాంగ దండప్రణామంబులర్పించి పూజించి మిగుల ఖిన్నుండై నిలచియున్నంగని హరి యిట్లనియె

వసునాథా! నీవేల యిటు ఖేదపడుచున్నావు? నీమనస్సును నే దెలిసితి. నేనచటికి జనుచున్నాను. భక్తజన రక్షణార్థమై శేషాచలంబు నకు బోయి నివసించియుండెదను, నీవప్పుడప్పుడు జనుదెంచి నన్నును నీతోబుట్టువగు పద్మావతిని గనుచుండుము, అని యోదార్చి శేషా ద్రికి బైలుదేర వసుధానుండును, తొండమానుండును, పద్మావతీ యుక్తముగా ననేక వాద్యంబులు బోసు సెలంగ నఖిల మునిగణంబు లాశీ ర్వదింప అజ రుద్రేంద్రాదులు యిరుప్రక్కలం గొలువ బ్రహ్మ ఋషు లగు సనకసనందన సనత్కుమారులు తుంబురు నారదాదులు ఆహ్లాద మొంద వికృతినామ సంవత్సర శుద్ధ పాడ్యమియందు శుభలగ్నంబున సాయంసంధ్యా సమయమున సాక్షాత్ శ్రీనివాసమూర్తి వేంకటా చలంబున కరిగి వైఖానస శాస్త్రోక్తముగా పుణ్యాహ వాచనాది కార్యంబుల నెరవేర్చి ఋషిజనంబు లాశీర్వదింప మహా వైభవముతో నూతనముగా నిర్మించియుండు యాలయంబున ప్రవేశించి కనక సింహా సనమున నిలచి బ్రహ్మాదిమునీశ్వరులగాంచి దక్షిణహస్తముతో నిదియే

పరమపదమని విన్నవించిన నందరును సంతోషించిరి. అంత వైఖానస ముని ద్వారపాలకుల నిద్దరిని యిరుప్రక్కల ద్వారమునకు ముందు నిర్మించెను, తదనంతరము శ్రీవిష్ణు సన్నిధియందు రెండఖండ దీపిక లుంచి నిఖిల మునిగణంబులును విన నిట్లని పలికె,

ఇక్కలియుగ మున్నపర్యంతము యీయఖండ దీపికలు వెలుగు చుండును, కలియుగాంతమున నీదీపిక లారిపోవును. అంత జల ప్రళయము సంభవించును అట్టి సమయంబున శ్రీశ్రీనివాసమూర్తి వైకుంఠ మునకు నరుగుదురని యందరు నానందించిరి.

---

## హరికి బ్రహ్మచే జరిపిన బ్రహ్మోత్సవ క్రమము.

తదనంతరము వారిజాసనుడు శ్రీహరింగని మిక్కిలి చిత్తము చగురెత్తునో పద్మలోచనా మీకు ఉత్సవాదులు నడుప చిత్తమునం దెంచుచున్నాడను. అనుడు శ్రీపతి యజునితో నుత్సవాదులన లేశ మాత్రముగాదు, వేద విహితముగా యేయేకార్యము లెట్లుచేయుదురో నట్లే విగ్రహములనుచేసి వైఖానస మంత్రంబులతో ఈ యుత్సవము నారంభించవలయు ననుడు బ్రహ్మ మన్నగువారు సంతసించి మిగుల భక్తితో శ్రీశ్రీనివాసుడు యేర్పాటు జేసియుండు ప్రకారము ఉత్సవ విగ్రహములు తయారుచేయించి యా హరిచెంత నుంచిన హరి మిగుల సంతసించి సప్పటి కన్యా మాస శుక్లపక్షంబున దివ్యంబగు లగ్నంబున మృత్తికా సంగ్రహంబుజేసి యంకురార్పణంబు గావించి చిత్తానక్షత్రంబున ధ్వజారోహణంబు గావించి తద్దినము రాత్రి శేష వాహనమును, నామరుసటి యుదయమున నలఘు శేషవాహనంబును నాటిరాత్రి హంసవాహనంబును మూడవరోజుదయమున సంహవాహనమును నారాత్రి ముత్యాలపందలి యను వాహనంబును, నాలవ రోజుదయమున కల్పవృక్షమను వాహనంబును రాత్రి సర్వభూపాల వాహనంబును పంచమ దివస యుత్సవంబున మోహిని రూపముతో గూడిన పల్లకియుత్సవమును, రాత్రి గరుడోత్సవమును షష్ఠమ దివస ముదయమునందు హనుమద్వాహనమును సాయంతరము నాలవ జాము నందు వసంతోత్సవమును, రాత్రి యేనుగు వాహనంబును, సప్తమ

దివస ముదయమునందు సూర్యప్రభయును, రాత్రి చంద్రప్రభయును అష్టమ దివసంబున రథోత్సవంబును, రాత్రి యశ్వ వాహనంబును తొమ్మిదవనాటి యుదయమందు పల్లకియందు భూనీళా సమన్వితముగా యుత్సవముజేసి శ్రీవారి సన్నిధివీధి ప్రదక్షణముగావచ్చి మరల లోపల జని ఆస్థాన మంటపంబునకు వేంచేసి పిమ్మట చూర్ణాభిషేకంబు జరిగి శ్రీవారి సన్నిధివీధి ప్రదక్షణముగావచ్చి పుష్కరణియందు ప్రవేశించి శ్రీవరహ క్షేత్రమునం దవబృధస్నాన మాచరించి యచ్చట నుండి శ్రీవారి సన్నిధి ప్రవేశించి నాటిరాత్రి ధ్వజారోహణ మొనర్చి వారి వారికి జరుగదగిన మర్యాదలు జరిగి వారి వారి నివాసస్థలంబులకు వారు జనిన పిమ్మట బ్రహ్మ, శ్రీపతికి నమస్కరించి తానును తనచోటు నకు వేంచేసెను. అనంతరము తొండమానుండును శ్రీపతి యుత్తరువుమేరకు తన రాష్ట్రమునకు జని యప్రశాంత బిలమార్గంబున వచ్చి శ్రీరమణుని సేవించి యారాధించుచుండెను.

---

## కూర్మండను బ్రాహ్మణుని కథ.

ఇట్లుండ తన వద్దకు కూర్మదాసుడను నొక బ్రాహ్మణుడును, నవిప్రుని దారయు పుత్రులును గలసి పోవుచుండ మార్గమందు వర్షాకాలమగుటవలన చాల యిడుముల బడుచు తొండమానుని చెంతకుజని యాతని యనేక విధములకొనియాడిన నారాజు సంతుష్టాంతరంగుండై నవిప్రుని యారాధించి యొక యాసనమిప్పించి దానిపై గూర్చుండ నియోగించునెడ నతడు రాజుంగాంచి ఓ రాజేశ్వరా! నీకీర్తి యీ శేషులోకములందును బ్రసక్తి నొందియున్నది. ఇట్టి మిమ్ము బొగడ నేరితరము అయినను ఈదీనుని విన్నపంబొకటి యాలకింప వలయును. అది యెద్దియన నా తండ్రి గతించిన వెనుక వారి యస్థులను గంగలో విడువ ప్రయత్నించి పోవుచున్నారము. మార్గ మధ్యమున వర్షము తటస్థించియున్నది, మాకొక శిశువును గలడు, అదిగాక నాభార్య గర్భము ధరించియున్నది. వీరలు నడుచుటకు చాల శ్రమ జెందుచున్నారు. నడువశక్తిజాలనివారైయున్నారు, కాన నేను అస్థులను గంగలోవిడిచి వచ్చునంతవరకు వీరిరువురను మీ సంరక్షణలో

నుంచుకొన ప్రార్థన, మీరిట్లు గావించుటచే నేనిప్పుడు జనుదెంచు యాత్రాఫలంబు నీకుం జెందునని యనేక విధంబుల యా విప్రుండు నుతియింప యా రాజందుల కియ్యకొన్నవాండై యాబ్రాహ్మణునకు సెలవొసంగ నాతండు కాశీయాత్రకుంజనె. పిమ్మట రాజు సేవకుల రావించి యాబ్రాహ్మణ యిల్లాలిని పుత్రునినప్పగించి వీరికి నొక రమ్య గృహమును యిచ్చి దానియందు వారికి గావలయు సామగ్రుల షణ్మా సంబుల కగునట్లు నొసంగి రమ్మన వారట్లే యొసంగిరి ఇట్లు కతి పయ దివసంబులు జనినపిమ్మట యెవరో వారు నివసించు యింటి తలుపు వెలుపల చిలుకు తగిలించియుండ వారు వెలుపలికి వచ్చుమార్గంబు దెలియక వారల కిచ్చియుండు సామగ్రినంతయు భుజియించి మరల భోజనమునకు సామగ్రిలేక ఆంకలిచేత డస్సి దేహమునుండి జీవమును వదలినవారై బైట నలుతెరంగుల తిరుగసాగిరి. అంత కొన్ని మాసం బులకు గంగా యాత్రకువెళ్ళిన పామరుడు వచ్చి రాజుంగాంచి ఓ భూ పాలా! నీకు శుభమగుగాక. తమ కటాక్షముచే సమస్త తీర్థంబుల, సేవించి వచ్చినాడను. నాభార్య బిడ్డను, నాంప్పగించిన నాగ్రామ ముజేరి సుఖించెదనన రాజు చారుల రావించి బ్రాహ్మణ పత్నిని, పుత్రుని, తీసుకరావలయు ననగానేవారు జని యాగృహము బహిర్ద్వా రము యొక్క కవాటమును కొక్కెము వేశియుండుటగాంచి వెంటనే దానిని దీసి లోన ప్రవేశించి జూడ వారిరువురును మరణించియుండుట, గని యాసంగతి రాజున కెఱింగించిరి.

ఆవార్తవిన్న రాజు మిక్కిలి విచారపడ యేమియుం దోచక దిగ్భ్రమ జెందినవాడై నందు మిక్కిలి వాపోయి హరిని, దలచినవాడై యావిప్రునిగని విప్రవర్యా! మీదారపుత్రు లిరువురును మాయాడు వారితోడ, వేంకటాచలమునకు జనుదెంచియున్నారు. గాన నీ వాచ మనంబొనర్చి భుక్తిగొనవే యనుండు అతండట్లె యొనర్చియుండెను,

ఇట్లుండ కొంతసేపటికి సూర్యుడస్తమించెను. ఆ విప్రుడు నిద్రించె పిమ్మట తొండమానుడెవరికి దెలియక బిల మార్గంబున. శ్రీహరి చెంత కరిగి నమస్కరించి దుఃఖముతో నిలిచియున్న రాజుగని హరియిట్లనియె, మామా! యిదేమి హాశ్చర్యము ఇట్టి, నిశాసమయం బు కొంచమైన భీతిలేక యొంటరిగాం జనుదెంచితివి? మరియును నీముఖ

భావమునుజూడ హృదయమున యేదో తల్లడము కలుగుచున్నది. నీవేల యిట్లు శోకమవలంభించి యున్నాడవన భూపతి శ్రీపతి కిట్లనియె. దీజగ దంతర్యామియగు సర్వేశ్వరా! నీకు తెలియని సంగతి యొకటి కలదా? ఇక్కాలంబునకు నాకొక మహాఘోర పాతకంబు సంఘటిల్లె అది యెయ్యది యనుడు నొక భూసురోత్తముని భార్యయు బిడ్డయు మాయింటనుండ యెట్టులో వారిరువురును గతించిరి. కారణ మరయగా రామికి వగచెద వారిని గురించి నాకిట్టి దుఃఖము సంప్రాప్తించె వారిని బ్రతికించి యీపాపమునుండి కాపాడవే యనుడు హరి మానుగారిచే యావద్వృత్తాంతమువిని వగలంబొగిలి యిరువురును యాలోచించి యీనిశాసమయమందే మిక్కిలి వేగముగలనిద్దరి దూతులరావించి యాకళేబరంబులను వేంకటాచలంబునకు దెప్పించి శ్రీహరి పుష్కరిణి యను హస్తి తీర్థమున నాశవంబుల యుంచి లేవనెత్తిన నప్పద్మాత్తు మహిమచే వారిద్దరు పునర్జీవితులైరి. తొండమానుండు హరిని మిగుల భయభక్తి విశ్వాసములతో ప్రార్థించి నిలచియున్న భక్తవత్సలుడు మామా నేను మాటలాడుచుండుటవలన గదా యిట్టికష్టములు వాటిల్లుట ఇట్టివే యనేకంబులు నాచెంతకు వచ్చుచుండును గాన నేనిది మొదలు యెవ్వరితోడను మాటాడ వీలుపడదు. కాన నేను మౌనమును ధరియించి నాభక్తులగు వారికెట్టి కష్టములు కలిగినను వారు నిద్రించుకాలమున నేను జనుదెంచి వారి కష్టంబులనెల్ల విచారించెద నని జెప్పి యిది మొదలెవ్వరితోడను మాటాడక మౌనము ధరించి మిన్నకుండెను.

తొండమాన్ చక్రవర్తి శ్రీహరిని సువర్ణపుష్పములచే పూజించుట.

అనంతరము తొండమాన్ చక్రవర్తి దివ్య కుసుమములను సువర్ణసూనములను బిలమార్గమున గొనివచ్చి శ్రీపతిని పూజించు చుండెను. ఇట్లు ప్రతిరోజు భక్తి విశ్వాసంబులతో పూజించుచుండ ననేక వత్సరంబులు గడచె. ఇట్లొకరోజున కవాటంబు దెరచి శ్రీవారి

పాదపద్మంబుల వీక్షింప నందు మంటిపూలు మాత్రము పాదముల యొద్దను బంగరు పుష్పములు వెనుక దవ్వుననుండగాంచి యిట్లు తనలో తాను వితర్కించుకొనె, అచ్చటెవ్వరును లేదు. కవాటము వేసినది వేసినట్లున్నది. అని దిగ్భ్రమజెంది వంతనొందె హే దయామయా! నేను భక్తితో నర్చించిన బంగరు పువ్వులు నేలపాలుగావించి మట్టిపువ్వుల ధరింప గారణంబేమి? నేజేసిన నేరమెయ్యది ఇప్పువ్వులు ధరింపజేసిన పూజ్యుడెవడు? అదన్యునిజూపి నామనఃక్లేశమును బాపవేయని బలుతెరంగుల ప్రార్థింపుచున్న రాజుంగాంచి శ్రీనివాసుడు పక్కున నవ్వి యిట్లనియె. ఓ భక్తశిఖామణీ! నీవేల చింతించెదవు?



—: భీముడను కుమ్మరదాసు హరిని మట్టి పువ్వులతో నర్చించుట:—

చెప్పెద వినుము ఇచటికి రెండు క్రోసులదూరంబున భీముడను నొక కుమ్మరీడు గలడు. అతడు మిక్కిలి నిష్పచ్చరముచే నలగినను నాయందలి దృఢభక్తిని వదలక నన్ను బూజించుచుండు. మరియు నారూపమును దారువుచే గావించి మంటిచే నొక యాలయంబునిర్మించి దాను ప్రతిదినము పాత్రలు చేయునపుడెల్ల తన పాణిద్వయము నందతికికొన్న మన్నుచే పువ్వులగావించి మిక్కిలి భక్తిచే నన్నర్చించుచుండు కాన, నేనాపుష్పంబుల పొచ్చములేక గ్రైకొనుచుందు, నన్ను మెప్పింప భక్తితప్ప యొండు ధనంబులేదు. భక్తిరహితమైన పూజలు

మేరువంతైనను తృణమువలె భావింతు భక్తియుక్తమైనయర్చన తృణంబైనను మేరువువలె నెన్నెద. భక్తిలేక ముక్తిజిక్కదు అనుడు భగవంతుని వాక్యమువలన పరమానంద భరితుడై హరిని పూజించు బిలమార్గంబున,

## తొండమానుడు భీమునితో సంభాషించుట.

తొండమానుడు భీముని యింటికి వచ్చెను. రాజేంద్రునిగన్న కుమ్మరదాసుడు భయభక్తి విశ్వాసములచే వందనం బాచరించి పీఠముపై గూర్చుండ నియోగించి స్వామీ! దేవరవారి రాకకు నే ధన్యుడనైతిని. అస్మద్గృహంబు పావనంబాయె, తాము వచ్చిన కారణంబు దెలుప వలయునన్న రాజిట్లనియె, కుమ్మరదాసా! నీవు పరమ భక్తాగ్రేసరుండవు, నీభాగ్య మేమనగలను? శ్రీయఃపతిని పరమభక్తితో నారాధించిన వాడవు. మహాసుగుణివి దేవున కంతరంగభక్తుడవు, పరమ పవిత్రుడగు నిన్ను గని నేధన్యుడనైతిని. ఓభక్తజన శేఖరా! శ్రీహరిని పూజింపవలయు మర్మము నీవలన దెలియ నరుదెంచితి. అయ్యది నాకెఱింగించిన నేధన్యుడయ్యెదనుసుమా! ఇద్దానికైయేను నీ చెంతకు వచ్చితిని. అనుడు కులాలుడు రాజచంద్రా! నన్ను శ్రీపతి పాదసేవకుడని చెప్పుటలో నేమి యాశ్చర్యమున్న దనుచుండగా లక్ష్మీపతీ ఖగవాహన రూఢుడై నిజభక్తునికి సేవ యొసంగ నతడు మిక్కిలి యుప్పొంగి యానంద:—

## హరి భీమునకు మోక్షమిచ్చుట.

బాష్పంబులు నేత్రారవిందంబుల నలమినవాడై వందనం బనేకంబులిడి నుతియింపుచున్న భగవంతుండు భీమునిగాంచి నీభాగ్యము పండినది నీభక్తికి మెచ్చితి నీకు మోక్షమిచ్చెద ననుచుండ నంతలో విమానంబు వచ్చినిలచె. అప్పుడా కులాలుడు హరికి ప్రదక్షిణ నమస్కారములొనర్చి జాయాసమేతముగా విమానము నారోహించి వైకుంఠమునకు బోయె. అంత తొండమానుడు తత్తరంబొందుచు ఓ వాసుదేవా నీకింతకపటంబెందుకు నీభక్తునితో మాటాడ నేనెంతో ప్రయాసతో వచ్చి మాటాడుచుండగనే వారిని నన్నెడబాపితివే సర్వసముడై

నీకిది న్యాయమా? అభేదవంతులగు మీరు భీమునికి మోక్షమిచ్చి నన్నిచట విడుచుట భావ్యమా? ఇట్లనేక విధముల వందరుచున్న వసుమతీశుతో పుండరీకాక్షుండు చిరునవ్వుతో రాజేశ్వరా! నీవు బీమునితో మాటాడుచుండ మోక్షమిచ్చునట్లు వరంబొసంగియుంటిని అక్కారణంబున నతనికీ దినంబున సాయుజ్యమొసంగితి నీకును మోక్షమునకు కొరతలేదు, నీవు పరమ వైరాగ్యమూని నీసుతునకు రాజ్యాభిషేకమొనర్చి పిమ్మట స్థిరచిత్తము గలవాడవై మన్నిలయంబున నిలిచి తపంబొనర్పుము. నీవు శీఘ్రముగానే మోక్షముబడయుదువని హరి యరిగె. తొండమానుడట్లే తన తనయుండు శ్రీనివాసునికి పట్టముగట్టి వానికి రాజనీతులెల్ల దెలిపి భగవంతుని యెడల భక్తిగలిగి వర్ధిల్లుము. మరియును కుమారా! మనకు వేంకటేశ్వరుల పాదారవిందములే యాధారము గనుక ఆ జగత్పతికి సకలోత్సవములు తప్పక జరిపి ధన్యుడవగుమని బుద్ధి గఱపి:—

## తొండమానుడు తపమున కేగుట.

వెంటనే వేంకటాద్రికి నరిగి యొక నిర్మలస్థలంబుననిలిచి తపము గావింప నా తపమునకు శ్రీనివాసుడు మెచ్చి ప్రసన్నుడాయెను. అప్పుడు రాజు శ్రీవరదా నీకనేకాభివందనములు హే కృపాసముద్రా నే మున్నొనర్చిన నేరములన్నియు మన్నించి నాకు మోక్ష మొసంగుము నీకన్న నాకు వేరుదిక్కెవ్వరు? అని పలువిధముల స్తుతియించి పాదముల పైబడి లేవకున్న రాజును తనదక్షిణపాణిచే లేవనెత్తి రాజేంద్రా! యింకను కొన్నిదినము లిచ్చటనేయుండెదవా? లేక యిప్పుడే పరమపదమునకుబోయెదవా? అనుడు భూపతి శ్రీనికేతనా! నన్నేల మరల సంసారసాగరంబున బడద్రోయ నెంచెదవు? నేనీ భవసాగర మీదజాల. ఇకనన్ను మోసపుచ్చకుము నీ కృపకు పాత్రునిగాదలచి నన్నేలుము. అని నుతింపుచున్న రాజుంగని మధుకైటభారి భూపా! నీ మనం బరయగోరిట్లంటినిగాని యొండుగాదు. నీవు నా కంతరంగ భక్తుడవు నిన్ను జేపదలుదునా? నన్ను మరచు వానినే మరతు, నన్ను మరవని వాని నేమరువను. అని బిగ్గ కౌగలించుచుండ దివ్య విమానమొండు జనుదెంచెను. దాని పై చక్రవర్తిని యెక్కించి పరమ పదమునకు అనిపి యెప్పటియట్లు స్వామి యాలయంబు జేరియుండెను.

పిమ్మట తొండమానునికి తనూజుడు శ్రీనివాసుడు వైదిక కర్మలనెల్లఁదీర్చి సుఖముగ రాజ్యము నేలుచు వసుధానుండును తానును శ్రీపతియందలి భక్తివదలక శ్రీవారికి చేయు నిత్యోత్సవ, మాసోత్సవ పక్షోత్సవ, వసంతోత్సవ నిత్యోత్సవములను తప్పక జరుపుచు హరిభక్తులయి వర్తించుచు కొంతకాలమునకు ముక్తినొందిరి.

## హరి లక్ష్మీదేవిని దలచి చింతిలుట.

పిమ్మట వేంకటగిరియందు శ్రీపతి పద్మావతి లలామతో చాల కాలము సుఖించియు తృప్తిలేక తన వక్షము వీడిపోయిన లచ్చిని దలచి తలచి యొకానొక దివసంబున నిట్లు తనలో దాదలపోసి కొనియెను.

ఔరా! స్వస్థానంబగు వైకుంఠమునున్ను, సూరి జనులనున్ను యెడబాసి భూలోకమునకువచ్చి మానవాకారమెత్తి యనేక లీలా వినోదములు గడపితి. ఇక మీదిట్లుండుట పాడిగాదు. ఉరమువీడిన సిరిని వదలియుండుట యెట్లు? యెవ్విధమునైన లక్ష్మిని సమాధానపరచి వక్షమందుంచుకొనియెద ఇట్లు జేయనిచో కీర్తిదక్కదు. ఇది యిట్లుండ పౌలస్త్యునిచే ఋణముగాగొన్న సొమ్మెట్లుదీర్తు. నా సింధుకుమారిని వదలి యొంటరిగా నెట్లుందునని సమస్త కార్యములయందు విరక్తి జెంది చిన్నబోయినముఖబింబముగల భర్తనుగాంచి యొకనాడు పద్మావతి యిట్లు పలికెను. నాథా! మీరిట్లు విన్నదముతో నుండుటకు గారణమెయ్యది యెరింగింపు మనుడు హరి యిట్లనియె, తన వక్షమున భృగుమహర్షి తన్నుటయు అకారణంబున లక్ష్మి కోపముతో వక్షమును వీడి కొల్లాపురమునకరిగి తపంబు సలుపుటయు లక్ష్మి తన్ను బాయుటచే తానువచ్చి వల్మీకము జేరుటయు గొల్లనిచే దెబ్బదినుటయు మున్నుగాగల వృత్తాంతమంతయు పద్మావతి కెఱింగించెను, అంత పద్మావతి వంతనొందిన డెందముతో దేవా! సిరిలేని కారణమున గదా మీరిట్టి యిడుములబడుటకు దావలంబాయె.

## హరి తపంబు చేయబోవుట.

ఆ జగన్మాత యెచ్చటనున్నను పిలుచుకొని వత్తమన ప్రియురాలిగని హరి యిట్లనియె. ఓ సుందరీ! నీపల్కులచే నామనంబు మిక్కిలి

సంతసంబందినది నీవు పసిదానవు కాన, నావెంటరావలదు. గృహము నందె నెమ్మదిగానుండుము, నేను కొల్లాపురమున కరిగి తపమాచరించి యైన పిలుచుకొనివచ్చెద నీవు నన్ను గురించి వంతనొందకుము. వకుళమాలికాదేవి నన్ను గన్నతల్లివోలె నరయుచుండును. నాకెట్టి జడుపునులేదు. అప్పుడు హరి వకుళనుజూచి నేను కొల్లాపురమునకు బోయి లక్ష్మిని పిలుచుకొనివచ్చునంతవరకు పద్మావతిని జాగరూకతతో గాచుకొనియుండుము. అని మరునాడరుణోదయమున మేల్కాంచి కార్యకరణీయములు సల్పి వకుళకు పద్మావతికి తన పోయివచ్చుట దెల్పి యప్పుడు వైనతేయుని పైనెక్కి కొల్లాపురమునకు ప్రయాణ మయ్యెను హరి తనకై వచ్చుచున్న విషయము లక్ష్మి తెలిసికొని తక్ష ణము యచ్చోటుబాసి రసాతలంబునకుబోయి యచ్చట తపంబొనర్చు చున్న కపిల మహర్షి యాశ్రమంబుచేరి యెప్పటియట్లు హరిని మది నిడుకొని తపం బాచరించుచుండెను.

పిమ్మట రమాపతి కొల్లాపురమునకేగి లక్ష్మియున్న నెలవు నరసి యరసి యచ్చంద్రసోదరిని గానక ఖిన్నుడై యేమియు దోచక చిత్తంబున తత్తరంబొందుచు కాముకుని చందముగ నందురి ఆహా! ఇన్ని దినంబు లిచ్చటినుండి, నేను వచ్చుజాడ నెఱిగి యెందు దాగితివో గదా! హా! దైవమాయని తత్తరంబంది నా సింధుపుత్రిని జూడక నేనెట్లు తాళుదునని వగచుచు ఇట్లు కొంతతడవు విచారపడి మఱల కొల్లాపురంబుజేరి యందొక్కటి యగస్త్యఋషిచే పూజింపబడుచున్న యర్చావరూప లక్ష్మీ విగ్రహంబును గాంచి యాదేవిని తన మనంబున నిల్పి దశవర్షంబులు తపంబునేయుచు లక్ష్మిని దలచి చింతిలుచున్న సమయంబున దివంబున అశరీరవాణి యిట్లనియె.

## ఆకాశవాణి హరికి వుపాయము జెప్పుట

ఓ పురుషోత్తమా మీరిచట జేయు తపంబునకు యీదేవి ప్రసన్ను రాలు కాజాలదు. కాన కృష్ణానదికి దక్షిణముగా నిరువది యెనిమిది యామడల దూరంబున వెలసియుండు సువర్ణయను వాహిని గలదు. దాని యుత్తర తటంబున అగస్త్యాశ్రమ మొండుగలదు. ఆయాశ్రమం బునకు పూర్వదిశగాయుండు దివ్యస్థలంబున నొక సరస్సుగలదు. అందు



అం

స్వర్లోకమునుంచి హేమకమలంబుదెచ్చి దానినందు స్థాపించి యాసరసికి పూర్వభాగంబున భాస్కర ప్రతిష్ఠించి తత్తీరంబున నిలచి చదరని మదితో లక్ష్మీమంత్రము నుచ్చరించుచు దృష్టితప్పక కమలను హృత్కమలమున నిడి పండ్రెండు వత్సరములు తపంబుగావించిన లక్ష్మి ప్రసన్నయై నీవక్షంబున నిలుచు ననుడు సంతసించి తూర్ణముగా సత్కార్యము పూర్ణంబొనర్చి రాజవేషధారియై తార్క్ష్యవాహనము నెక్కి వెంకటాచలముచేరి పుష్కరిణిలో గ్రుంకి యచ్చట భూసురులచే పూజలంది సత్వరమగ్గిరి యవరోహించి సువర్ణముఖి తీరంబుననున్న స్థలంబునకువచ్చి వాయుభట్టారకుని తలంప నతడాక్షణంబున దృశ్యుడయ్యె. అప్పుడు నమస్కరించి నిలచియున్న సదాగతిని గాంచి ఓయీ! నీవీ తక్షణంబునబోయి గగనధునియందున్న హేమకమలంబు నాళంబుతోడ దెమ్మన నతడట్లె యెగిరి సమూలంబుగా హేమాబ్జంబును దీసుకొనివచ్చి మహాభయభక్తితో హరి చేతికిచ్చి యథేచ్ఛ నరిగె.

పిమ్మట జగత్పతి దివ్యకమలమును సరోవరమున నాటి అసరీరి వాక్కుల సరణిని తపంబుచేయ దీనిగన్న యింద్రాదు లనేకాప్సరోగణమును లనిపి తపోవిఘ్నం బొనర్పగడగినను దానికి చలించకయు వారి తళుకు బెళుకులకు చెదరని మదిగలిగి. వారెన్ని టక్కు టెక్కులొనరించినను వానికి లొంగకయు చిత్తజుని ఫాకను చిలుకల పలుకులకు శారికల కోలు మూల్గులకు మనంబును గలంగనీక కన్నులు విచ్చి చూచెను, వారు తనపై వైచుచున్న మిల్లెమొగ్గలు, జాజి విరిజాజులు మున్నగునవి దిగ్గుచున్న వారి వికారంబు గన్న కమలాపతి క్షిప్రముగా నొక్క జగన్మోహినీ లావణ్యవతి నొక్కతెను సంకల్పంబున సృష్టించె, అంత నాటక్కులాడు లందరు దాని లావణ్య మరయుటతోడనే లజ్జబొంది విభ్రాంతితో యచ్చటనుండి కదలి యివ్వార్త నింద్రునికి జెప్పిరి, అతడీ యుదంత బంతయువిని విచారపడి యిది శ్రీమహావిష్ణువుచే సృష్టితమే యని తన పరాభవమునకు పలుమారు తపించి హరి కనేకాభి వందనమును చేసెను,

అంత శ్రీపతి జగన్మోహినింగాంచి సుందరీ నీవిది మొదలు భూలోకవాసుల కోర్కెలీడేర్చుచు వారి పూజలందుచు వర్ధిల్లుచుండుమని సెలవొసంగెను పిమ్మట యథారీతి తపమొనర్చుచుండెను.

## పద్మావతి హరినిదలచి చింతిల్లుట.

హరి తన్ను బాసి పోయినదిమొదలు పద్మావతి యలంకరణంబులు జాలించి నిద్రాహారంబులులేక నశ్రాంతము హరిని మదినిడి ధ్యానించుచు, కన్నీరు విడుచుచు నామాధవు నెన్నడు గందునని కలవర పడుచు ఒకనాడు వకుళమాలయొద్దకుబోయి వకుళా! వాసుదేవుడరగి యినువది రెండు సంవత్సరములయ్యె, ఇంతవరకు యెచటనున్న పోకడయు తెలియకున్నయది ప్రతిదినము నాకలలో ప్రక్కన నిలచి తపము చేయునట్లు తోచుచున్నారు. అయ్యెందువడన బోడగట్టెనో లేదో ఒకవేళ నన్నుగువతోడ గలసి సుఖముగ క్రీడించుచున్నాడు కాబోలు అమ్మా! నామనంబున మిక్కిలి కలత బొడముచున్నది. నేనేమిచేయుదు దినమొక యుగముగా దోచుచున్నది. వారి సుందర వదనారవింద మెప్పుడు గందునోయని వందరుచున్న నా యన్నుల మిన్నతో వకుళ యిట్లనియె, ఓజననీ నీవిట్లు పరితపించుట నీతిగాదు. ఆ పరాత్పరుని కెందును వోటమిలేదు. సత్వరమ కమలతో వచ్చి చేరును. నీవు వేదురు నుడుగుము అని మాటిమాటికి నోదార్చుచు ధైర్యోత్సాహంబులు గల్పించుచు కాలము బుచ్చుచుండిరి.

## కపిలమహర్షికిన్ని లక్ష్మీదేవికిన్ని సంవాదము.

పిమ్మట అధోభువనంబున కపిలముని చెంత తపంబొనర్చుచుండు రమాదేవి యిట్లు విచారింపదొడంగె. హా! జగత్పాలకుడు యిట్లు జడలుదాల్చి తపం బొనర్చుచున్నాడే నేనెట్లుజూచి నిద్రింతును అని చెంతనున్న కపిలమునికి వందనమొనర్చి గత వృత్తాంతమంతయు బూస గ్రుచ్చినట్లు పలికిన యనంతర మమ్ముని లక్ష్మినిగాంచి యో లోకమాతా! హరి వక్షంబువీడి వచ్చుటకు గతంబెయ్యది? అనుడు లక్ష్మి భృగువు విష్ణుని వక్షమునదన్నుటయు శ్రీవల్లభుం డతని దండింపక సన్మానించినపుటయు పిమ్మట లక్ష్మి తన్నుబాయుటయు అందులకు శ్రీనాథుని మది జెదురుటయు, పిమ్మట లక్ష్మి కొల్లాపురము జేరుట మున్నగాగల వృత్తాంతమంతయు దెల్పిన కపిలమహర్షి యిట్లనియె.

అమ్మా! నీవు జగజ్జననిగానుండియు నీవుచేసిన కార్యము వింతగా

నున్నది. సతికి బతియేగతి పతియాజ్ఞకు మిగిలినపని సతకిలేదు. మరియు వారిమాటకు వ్యతిరేకముగా మీరు యొంటరిగా సంచట యు లాకీగాదు భార్యకు భర్తకుమించిన ప్రాపులేదు. వాసుదేవుని ప్రాపుబాసి వారినినొప్పించుట భావ్యమా? భర్తనువదలి భార్యయెన్ని తపములు, వ్రతములు, ఉపవాసములు ఎన్ని జేసినను వమ్మా. అవి యె వరికి ప్రియము అమ్మా! సాగరుని యనుంగుపట్టివై పద్మనాభుని చెట్ట బట్టి నీకీ మొరటుపట్టు యెట్టులమరె. వారే తప్పు యొనర్చిరి. భృ గుండు తన్నె నంటివి అతడెట్టివాడు బ్రహ్మమానస పుత్రుడు. పరమ పావనుడు. నీపౌత్రుడుగాడా! ఆయన నీభర్తయొక్క సత్వగుణమును పరీక్షింపగోరి వారి సత్వమును లోకమందు స్థాపింపగోరి యిట్లొనర్చె కాని అక్రమముగాదు. ఇదియునుగాక ఆయన గర్వముచేత యిట్లు చేసెననుకొందము అదియును భర్త కిష్టమైనచో భార్యకును యిష్టమె నీవిధి యాలోచింపక మొరటితనముగ ప్రవర్తించితివి. ఇది న్యాయము గాదు అట్లు నీవు హరిని వదలివచ్చిన వారికేమిలోటు వాటిల్లునది. ఇంకను వారు క్రొత్త పెండ్లికుమారులై యున్నారు. నీవే యోచన చేయగా నేరమంతయు నీయందేయున్నది లేని పోని నిందారోప్ణ యొ నర్చి నీవు దాగియుండుట బాగుగాదు. కరుణాసముద్రుడగు జగత్పతి నీపై నెనరుగలిగి సకలభోగవర్జితుడై జడలుగట్టి నీనామమును జపిం చుచు నిద్రాహారంబులు లేక యిరువదిరెండు యేండ్లు తపముచేయుట నీవు డాగియుండుట యేమి న్యాయము? కాన నాకు తెలిసిన వరకు జెప్పితిని. నాపై కినుకవలదు. అనుడు లక్ష్మి యిట్లనియె, ఔరా! నేనెట్టి పాపకార్యమున కొడిగట్టితి? నా ప్రాణేశ్వరు నిన్ని యిడుముల గుడిపితినే యని వందరి వాపోవుచున్న లక్ష్మితో నారాపసి యిట్లనియె.

ఓ సర్వలోకనాయకీ! నీవేల దుఃఖపడెదవు. కారణాంతరములచే మీకిట్టి వియోగము కలిగెను: కానిచో గొయిందుగాదు. కాన నీవు హరిని జేరుమనుడు లక్ష్మి మునివరా! నేను హరివక్షంబున నున్న నాచవతియగు పద్మావతిని యోర్చునె? అనుచుండ కపిలుండమ్మా! నీవు హరికి నిత్యానపాయిని హరిని క్షణికమైన నీవు వీడియుండవు, నీకును

హరికిని జేసమెయ్యది? అతడెన్ని అవతారమెత్తినను నీవును అన్ని యవతారములెత్తి వారిని బాయకయుందువు అమ్మా! నీమాటపై హరి పద్మావతిని పెండ్లియాడుట. ఇవన్నియు నీకు నీవే యాలోచించి చూడుము నీకు దెలియని నీతులు భూతలంబున గలవా? ఈ లోకుల నాదరించుకొరకై మీకీ తగవుగలిగె గాబోలు లోకజననివై యున్న నీవిచట తపంబొనర్చు కారణముచే నా యాశ్రమము గూడ పావనం బయ్యెను. నేధన్యుడనైతిని తల్లీ! పరాకులేక జగదీశుడు దృష్టినిల్పి యున్న కమలములో ప్రవేశించి యతనికిప్రసన్నవై యథారీతి యతని వక్షంబుజేరి జగంబుల బ్రోవుమని బల్కిన మునీంద్రా! మీ యిష్టాను సారము మీ మాటను దాటక నామనోహరుని వక్షమందు జేరెదనని నమస్కరించి మిక్కిలి యానందమున రసాతలము:—

# లక్ష్మి పాతాళలోకముననున్న పద్మసరస్సు జేరుట

వదలి చనుదెంచి పద్మసరస్సునందుండి వెడలి యాకనక కమల కర్ణిక మధ్యంబున వెలుగుచున్న పదియారేండ్లు ప్రాయముగలదివై పద్మ మున పద్మాసనీ పద్మహస్తవై ప్రకాశించుచున్న యిందిరాదేవికి కిరణ ప్రసరణ మొనర్చి పద్మమును వికసింపజేయుచు దినకరుడు ప్రణ మిల్లి నిలిచియున్న తరుణంబున బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు గుమి గూడి యచటికివచ్చి స్తుతించుచు దివ్యవాద్యంబులు మ్రోయించినిలచి యున్న సమయమున హరి తపంబుచాలించి శంఖ చక్ర గదా శార్ఙ్గ హస్తుడై కోటిమన్మథరూపలావణ్యంబుతోడ ప్రజ్వరిల్లుచున్న జగత్పతి చెంతకు విధి యరుదెంచి ఓ దేవదేవా! మీకొరకై శ్రీదేవి ప్రసన్న మూర్తియై యెదురుచూచుచున్నది. మీరెప్పటియట్ల వక్షమందునిల్పి కాపాడవలయునన్న హరి మిన్నకయుండెను పిమ్మట లక్ష్మీ చెంగటి కరిగి ఓ జనని పురుషోత్తముడు నీకై శంఖ చక్రధారియై యెదురు వేచియున్నాడు. వేగము విచ్చేయుము. అని పద్మ సరస్సులోనున్న

లక్ష్మిని బిలువగా ఆమె బ్రహ్మమాటలు నాదరింపకయున్న రమాదేవి భావమెరిగి భృగుమహర్షిం గన్నుసైగ జేయ,

భృగుఋషి తన్ను మన్నించుమని లక్ష్మీదేవిని ప్రార్థించుట.

భృగుఋషి బ్రహ్మయభిమతము నెఱింగి తెప్పున రమాదేవి కెదుట నిలువబడి ఓజగన్మాయకీ! నేను నీ నాధుని సత్వంబరసి లోకంబున జాటగాల మీటితిగాన యొండుగాదు నే గర్వినై యిట్టికార్యము చేసిన వాడనుగాను. కాబట్టి నానేరము నెన్నక మన్నింపుము. నానింద బాపుము. నన్ను నీపుత్రునిగా భావింపుము. నీ విభుని వక్షంబున నెప్పటియట్లు వసియింపుమని పాదముల పైబడి ప్రార్థించుచున్న అమ్మునీంద్రుని యందనురాగము గలదియై మిక్కిలి యాహ్లాదముతో తపసిం గాంచి యిక లెమ్ము నీధైర్య సాహసమునకున్ను నీభక్తి యౌదార్యమునకును అచ్చెరు వొందితి అప్పురుషోత్తముని సన్నుటకును, వారిచే సన్మానితుడగుటకును నీకు తగు నిక నేరికి తగదు. నేనొప్పని మొప్పెతనముతో హరియందు మహాపరాధ మొసర్చితిగాని యొండుకాదు. ఇంతటికి గాలమును గడువనేరి తరము. ఇక నీవు నెమ్మదిగా వెడలి పొమ్ము అనుచుండ బ్రహ్మ యరుదెంచి తల్లీ! శుభలగ్న మరుదెంచి యున్నది. వేగమ విచ్చేయుము. ఎల్లరు కాచియున్నారు, నీ విభుని యురమును సరగున జేరుము అమ్మా! శుభకరంబగు కార్తీక శుద్ధ పంచమీ భృగువాసరయుక్త పుత్తరాషాఢ నక్షత్రము ఉత్తమమైనది మధ్యాహ్న కాలమున మంచిలగ్నము గనుక వేగముగా సరస్సు వదలి రమ్ము అనుచు బ్రహ్మవచనంబులు నాదరించి తెప్పున కమలమును వీడి కోటిసూర్యప్రభలచే విరాజిల్లుచున్న స్వయంప్రకాశమైన ముఖచంద్ర బింబమున మందహాస చంద్రికలు నివ్వటిల్ల మందగమనముతో నెల్లర మనస్సున కానందము సలమికొన శ్రీపతి ముందర నిలిచి చరణకమల ధ్యానియై దివ్య కుసుమంబులచే బూజించుచు వందనంబులిడి తనకు వసియింప ననువైన వక్షంబును వీక్షించుచున్న తరి రమాపతి చరణమణి గళంబున రమణీయంబైన కుసుమమాలిక వైచి మిగుల యానందముతో జగత్ప్రసిద్ధంబైన నభయహస్తముతో గౌగలించుకొన్నవాడై తన యురంబున నిడుకొనియె బ్రహ్మేంద్రాదులు జయజయ ధ్వనినంబులు సల్పిరి

దేవతలు కుసుమ వర్షంబు గురిపించిరి. తదుపరి అష్ట దిక్పాలురును శుక భృగు సనకసనందనాది మునిగణంబులును యీ పద్మసరస్సునందు సంకల్ప పూర్వకంబుగా స్నానముజేసి యెవ్వరేని మానవులు కార్తీక శుక్ల పంచమీ దివసంబున స్నానమాచరించి శ్రీలక్ష్మీసహితుడగు శ్రీనివాసుని సేవించిరేని పంచమహా పాతకంబులు పటాపంచలై సకలైశ్వర్య యుక్తులై తుదకు మోక్షార్హులగుదురని యందరొక్కపెట్టున శాసించిరి అప్పుడు బ్రహ్మ హరినిగని జగదీశా! పరమేశా! మీరు లక్ష్మీయుక్తముగ నిచ్చటనే వసియింపుడు, ప్రతి సంవత్సరము మీకీయుత్సవము జరుగవలయు కాన తాము సమ్మతించి వరంబొసంగుడన శ్రీపతి యియ్యకొనె. అంత వాణీకాంతుడు విశ్వకర్మను రావించి పద్మసరస్సున కాగ్నేయమూల బలరామకృష్ణుల సన్నిధికి ప్రక్కన నొక దివ్యాలయము గావింపుడన నతడట్లే యొనర్చె. అంత బ్రహ్మ శ్రీనివాసుని లక్ష్మిని యచ్చట నిలపి యచట తపంబొనర్చుచుండిన శుకమహర్షిని బిలిపించి తనచే పంచరాత్రోక్త ప్రకారముగా సకలోత్సవంబుల నెప్పటియట్ల కార్తికశుద్ధ పంచమీ దినంబున శ్రీనివాసుని కంఠమందుండు నొక సుందరంబగు దివ్య కుసుమదామమును సిరికి జెందునట్లుగా నేర్పాటు గావించి బ్రహ్మదేవుండు సత్యలోకమునకు జన అదిమొదలా శుకమహర్షి కుమారుడు ఛాయాశుకుడు పద్మావతీసమేతుండై యున్న శ్రీ శ్రీనివాస మూర్తిని యనేకవిధముల బూజించుచు శ్రీవారికి జరుగవలసిన ప్రతిదినవుత్సవములున్ను మాసోత్సవములనున్ను, వర్షోత్సవములనున్ను క్రమంబున జరుపుచుండ అంత శ్రీనివాసుడు పద్మసరోవరంబున బొడమిన సిరిని తన వక్షమందిడుకొని బ్రహ్మాది దేవతలకు గోరినయట్ల వరంబొసంగి లక్ష్మీదేవి సహితంబుగ శ్రీవారు శేషాచలంబుజేరి యచట పరమ భక్తులచే పూజితుడై నిజమందిరము ప్రవేశింప పద్మావతి యెదుర్కొని హరికి సిరికిని వందనంబులిడిన లచ్చి చాల సంతసించి పద్మావతిని నిండు మక్కువతో చెంతకు జేర్చి యాదరించెను. తదనంతరమహా హరి దేవసమూహము మొదలగు వారలకును మునులకును సమారాధన గావింప యత్నించి నొక్క నిముషంబున వంటకు కావలసిన సామగ్రులనెల్ల తయారుగావించి వంటకంబులును భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పానీయాదులతోడ తయారుగావించి వారికెల్లరకును భుక్తంబిడి

యెల్లరకును, దివ్యమణిమయ హేమవస్త్రభూషణాదులను, తాంబూలంబును యొసంగిపంపిన వారలు సంతసించి శ్రీలక్ష్మీనారాయణులకు నమస్కరించి వారివారి నివాసంబులకు వీడ్కొనిరి. అది మొదలు హరి సిరి పద్మావతులతోఁగూడి సౌఖ్యమునొందుచు దేవబృందముచే పూజలందుచు పరలోకవాసులకు తన మాయా స్వరూపమునుజూపుచు వారలచే వుత్సవాదులనెల్ల నెరవేర్చుకొనుచు, తాను వివాహము కొరకై కుబేరునియొద్ద తీసుకొన్న రొఖమునకుచేరు వాయిదాలును చెల్లించుచు సుఖముగా వర్తింపుచున్నాడు గాన,

శ్లో॥ వేంకటాద్రి సమస్థానం బ్రహ్మాండే నాస్తికించన ।
వేంకటేశ సమోదేవో నభూతో నభవిష్యతి ॥

ఈ బ్రహ్మాండ భాండమునందు శ్రీవేంకటాచలమునకు సమానమగు పుణ్యక్షేత్రము ఈరేడు లోకంబుల నెచ్చటనులేదు. కలిలో శ్రీవేంకటేశ్వరునికి సమానమగు దైవము లేనేలేదు. అని యివ్విధముగా లోకనాయకుండును, శ్రీమన్నారాయణుడును అగు శ్రీ వేంకటేశ్వరుని స్తుతించు భక్తులు ముక్తినొందుదురని సూతుండు శౌనకాదులకుజెప్పిన కలియుగ వైకుంఠమను శ్రీవేంకటాచల దివ్యక్షేత్ర మహాత్మ్యము.




శ్రీవాణి ముద్రాక్షరశాల, తిరుపతి:—1940.

## శ్రీ ఏడుకొండల వేంకటాచలపతి కథలు.

ఇందులో 1. కడుపునొప్పి కోమటిశెట్టికథ, 2. కానుకలహుండి దొంగకథ, 3. ప్రసాదముల దొంగకథ, 4. హరి వరపుత్రునికథ, 5. శ్రీవేంకటేశ్వర బిక్షువునికథ, 6. పుత్రసంతానప్రార్ధనకథ, 7. శ్రీవేంకటేశ్వర భక్తికథ, 8. త్రాగుబోదర్చకునికథ. వెల 0—4—0.

## తిరుపతి శ్రీరథోత్సవ మహాత్మ్యము

ఇందులో శ్రీవెంకటేశ్వరుని రథముక్రిందుగ పంచవర్ష ప్రాయుడైన యొక బాలుని సమర్పించిన చరిత్రమున్నది.

తోహరా కావ్యము వెల 0—1—6

## శ్రీ వేంకటాచల ప్రదర్శిని

ఇందులో శ్రీవేంకటేశ్వరుని మహాత్మ్యము, దర్శనము, అర్చనలు క్షేత్రనిబంధనలు, తీర్థములు, మంటపములు, మఠములు, దేవాలయంబులు, నింకయు ననేక ముఖ్యవిషయములు విమర్శనము చేయబడియున్నవి. వెల 0—4—0

## శ్రీ వేంకటేశ్వర ప్రార్థన

ఇందులో 1. నీలాలు ప్రార్థన, 2. వేయికాళ్ళ మంటపము, 3. పాషాణ ప్రసాదము, 4. మహాప్రభువు గంగాళము 5. విల్లియం హౌర చలిపందిలి, 6. శ్రీభాష్యకారులప్రార్థన, 7. గొల్లదాని మంటపము యీచరిత్రములున్నవి. వెల 0—3—0

## శ్రీ వేంకటేశ్వర లీల

శ్రీవేంకటేశ్వర భక్తియుపన్యాసమును. అవ్వలక్ష్మమ్మ చరిత్రములున్నవి.



శ్రీ అలమేలుమంగతాయార్